# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు
సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. R. NL. 15
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 36
5-9-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


# మార్కెటింగ్‌సొసైటీలో 25 లక్షల స్వాహా?

- తడిసిన ధాన్యం పేరుతో మంచి బియ్యం ఎగుమతి
- రేట్ల చెల్లింపులో వ్యత్యాసాలు
- మిల్లర్లతో లాలూచీ
- ఆడిట్‌లో అన్నీ అభ్యంతరాలే
- ప్రభుత్వానికి కలెక్టర్ నివేదిక

నెల్లూరుజిల్లా మార్కెటింగ్ సొసైటీలో లక్షలాది రూపాయల స్వాహాకార్యం వెలికి వచ్చిందా? అధికారులెవరూ పెదవి విప్పి బయలు తల్కొరంతవుగాని. మేము సేకరించగల్గిన సమాచారాన్ని బట్టి ఆశ్చర్యం కల్గించే స్థాయిలోనే అవినీతి డొంక కదలినట్లు కన్పిస్తూంది; ఈ కదలికకు కారణమైన తీగ, ఇప్పుడు కలెక్టరేట్ అధికారుల చేతిలో వున్నట్టుంది; వారు దాన్ని చేతికొంది లాగుతున్నారు!

మార్కెటింగ్ సొసైటీలో పెద్దఎత్తున గోల్మాల్ జరిగిందన్న ఆరోపణ మూడు సంవత్సరాలక్రితమే విన్పించింది. ఐతే, అప్పటి పాలకవర్గాధ్యక్షుడు, ఇప్పటి రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఆనం రామనారాయణరెడ్డి వాటిని పూర్తిగా తిరస్కరిస్తూ, సవివరమైనసాక్ష్యాలుచూపి, పత్రికలనోరు మూయించారు. అనాటి కలెక్టర్ కుమారి కె. సుజాతారావు ప్రభుత్వానికి ఒక నివేదికకూడా పంపింది. అంతటితో ఆ వివాదం సమసిపోయిందనే అందరూ అనుకున్నారు; ఆవిషయమే మరిచిపోయారు.

1983 నవంబరు, డిసెంబరు మాసాల్లో మార్కెటింగ్ సొసైటీ రైతుల నుంచి ముక్కిపోయిన, విరుగుడుకల్గిన ధాన్యంకొని, మద్రాసుకు ఎగుమతి చేయడానికి ప్రభుత్వానుమతి సంపాదించింది. ఇది రైతులకు పెద్దవరంగా భావించారు. రామనారాయణరెడ్డి అప్పటికి పత్రికా విలేఖరుల సమావేశంపెట్టి, తమ సొసైటీ ఈ ధాన్యంవ్యాపారాన్ని లాభనష్ట రహితంగా నిర్వహించి, అదనంగా మిగిలిన డబ్బును రైతులకే బోనస్‌క్రింద ఇస్తామని ప్రకటించారు. దానితో రైతులు కూడా, మిల్లర్లనువదలి, వేలాది టన్నులు మార్కెటింగ్ సొసైటీలకే అమ్మారు. సొసైటీ వాటిని మద్రాసుకు ఎగుమతి చేసింది. ఆ నాటికి మద్రాసులో బియ్యానికి అపరిమితమైన కటకట వుండడంతో, వారు అధికధరలిచ్చి కొన్నారు. సొసైటీ మంచి లాభమే ఆర్జించింది. తర్వాత కాలాకాలానికి రైతులకు పుట్టికింతని బోనస్‌కూడా ఇచ్చారు.

అయితే ఈ లావాదేవీలలో సొసైటీ సంపాదించిన ఆదాయంకంటే, పాలకవర్గం లేదా అధికారులు ఆర్జించినలాభమే అధికమని ఇప్పుడు విచారణలో తేలిందట. పాలకవర్గం పదవీకాలం తీరినతర్వాత, మార్కెటింగ్ సొసైటీకి జాయింట్ కలెక్టరు శ్రీ దయాచారి ఇన్‌ఛార్జిగా నియమితులైనారు. ధాన్యం వ్యాపారంలో గోల్మాల్ సంఘటనలు ప్రజలు, పత్రికలు మరిచిపోయినా, ఆయనమాత్రం వదిలిపెట్టినట్లులేదు. ఈ సంవత్సరకాలంగా, ప్రతిఫైలూ, ప్రతికాగితం నింపాదిగా పరిశీలించినట్లున్నారు. ఈలోగా ఆడిట్ జరిగిందట. వారు పెద్దసంఖ్యలో లొసుగులు కనిపెట్టారట, దానిపై నెల్లూరుజిల్లా కోఆపరేటివ్ బ్యాంక్ అధికారులు కలెక్టరుకు ఫిర్యాదుపత్రం పంపారట. కలెక్టర్ శ్రీ జన్నత్‌హుసేన్ ఈ విషయమై సమగ్ర విచారణకు ఆదేశాలు జారీచేశారు. ఆ దర్యాప్తు ఇంకా పూర్తికాలేదు.

అటు ఆడిట్‌లోకాని, ఇటు దర్యాప్తులో కాని బయటపడిన పెద్ద గోల్మాల్ - మద్రాసుకు జరిగిన ఎగుమతి. ప్రభుత్వం సొసైటీకి కేవలం తడిసిన, విరుగుడు కల్గిన ధాన్యం ఎగుమతికే పర్మిట్లు ఇచ్చింది. అయితే ఆ పర్మిట్ల ఆధారంతో, మంచి నాణ్యత కల్గిన బియ్యం ఎగుమతి చేశారట. తడిసిన ధాన్యానికి, మంచిబియ్యానికి ధర దాదాపు రెట్టింపు తేడా వుంటుంది. ఆ మిగులు సొసైటీ పుస్తకాలలో జమ అయ్యే అవకాశంలేదు. వ్యక్తుల జేబులలోకి పోయివుండాలి. అదే ధాన్యం ఎగుమతిచేస్తున్న 10 లారీలను కూడా అప్పుడు అధికారులు పట్టుకున్నారు. తర్వాత ఎఫ్. సి. ఐ. నిపుణులు కూడా అదే తేల్చారట. ఆ లారీ నంబర్లు, ఇతర వివరాలుకూడా అధికారులకు లభించినట్లున్నాయి. కాని వారు బయటపెట్టడంలేదు.

మా ప్రత్యేక విలేఖరి

నిజమైతే ఆ వ్యక్తులెవరు? ఆ మొత్తమెంత? అనధికారికంగా తెలుస్తున్న సమాచారాన్ని బట్టి, ఈ మొత్తం 10 లక్షలవరకు వుండవచ్చునంటారు.

అసలు మార్కెటింగ్ సొసైటీకి మంచి ధాన్యం ఎక్కడినుంచి వచ్చింది? ఏ మిల్లర్ల దగ్గరనుండి తీసుకున్నారు? అది అధికారయుతంగా జరిగిందా? లేక వెనుక దాటుగా తెచ్చారా? అందుకు కారకులెవరు?

తడిసినధాన్యం పర్మిట్లతో మంచి

మద్రాసులో అమ్మినరేటు ఒకటి, రికార్డులకు ఎక్కినరేటు ఇంకొకటి అంటున్నారు. ఎంతవరకునిజమో మాకు తెలియదు. పుట్టికి పదినుంచి యాభైరూపాయలవరకు తేడాలు కన్పించాయని, ఇది రికార్డుల సాక్ష్యాలతో నిరూపించడం సాధ్యంకాకపోయినా, ఈ పద్దులో అవినీతిఖాతా బజారులక్షలకు పైమాటేనని ఒక అధికారి రహస్యంగా మా చెవిలో ఊదారు.

—తరువాయి 7వ పేజీలో

## రిజర్వేషన్లు చెల్లవు!

### -హైకోర్టు తీర్పు

రాష్ట్ర ప్రభుత్వం వెనుకబడిన తరగతులవారికి విద్యా సంస్థలలో, 44 శాతం ఉద్యోగాలలో రిజర్వేషన్లు ఇస్తూ తీసుకున్న నిర్ణయాన్ని హైకోర్టు కొట్టివేసింది. 50 శాతానికి మించి రిజర్వేషన్లు చేసే అధికారం రాష్ట్ర ప్రభుత్వాలకు లేదని, ఈ కేసును విచారిస్తున్న డివిజన్ బెంచి అభిప్రాయం వ్యక్తంచేసింది. అందువల్ల రిజర్వేషన్లు చెల్లవని న్యాయమూర్తులు శ్రీ బి. పి. జీవన్ రెడ్డి, శ్రీ కె. రామస్వామి, శ్రీ వై. అంజనేయులు తీర్పుచెప్పారు. రిజర్వేషన్లకు 12 వేలరూపాయల పరిమితి విధించడానికి రాష్ట్రప్రభుత్వానికి అధికారం వున్నప్పటికీ, ఇది ఏకపక్ష నిర్ణయంగా కన్పిస్తూందని న్యాయమూర్తులు భావించినట్లు తెలిసింది.

తీర్పువివరాలు ఇంకా అందలేదు.

# రోజుకొకఇడ్లీ, కప్పు పెరుగు- ఇదేనట ఎన్టీఆర్ ఆహారం!

"ఉదయం ఐదున్నర కల్లా నేను ఆఫీసు టేబుల్ ముందు కూర్చుంటాను; అప్పుడే ఒకేఒక ఇడ్లీ, అరకప్పు పెరుగు తింటాను. తిరిగి మరునాటిదాకా ఏమీ తీసుకోను. అవసరమైతే రాత్రి ఒకగ్లాసు పళ్ళరసం తప్ప."

"నాకుకులం లేదు; నేను ఒకప్రత్యేక కులంలో పుట్టడం యాదృచ్ఛికమే ఇప్పుడు నా పిల్లలకూడా నాఇంట్లోవుండ తంలేదు నా ఆస్తి, ఇల్లు, పొలం కుటుంబం సర్వం వదిలేశాను. ఆశ్రమంతప్ప నాదంటూ ఏమీలేదు."

దేశంలోకెల్లా అత్యధిక ప్రాచుర్యం కల్గిన అగ్ర పక్షపత్రిక "ఇండియా టుడే" సంపాదకుడికి, ఒకఇంటర్వ్యూలో ఎన్టీఆర్ చెప్పిన మాటలివి. ఇందులో ఇటువంటివి ఇంకా చాలానే వున్నాయి. తప్పు అబద్ధాలను పత్రికలవారి ముందు కూడా మన ముఖ్యమంత్రి ఎంత నిర్భయంగా చెప్పగల్గుతున్నారా అని ఆశ్చర్యం కల్గుతుంది!

ఎన్టీఆర్ ఆహారపుటలవాట్లు, ఆయన కున్న బంధుప్రీతి, కులాభిమానం, అల్లుళ్ళు కొడుకులపై మమకారం తెలియని ఆంధ్రులుండరు. మొన్నటికిమొన్న ముత్తుకూరు - వచ్చినరోజుకూడా ముఖ్యమంత్రి రాగిసంకటి తినలేదు, కిలోకు పైగా బాదం పప్పు, అరు స్పెన్సర్ నాహాలు ఆరగించారట. ఐదికాళ్ళమంచి కోడిమాంసంతో క్యారియర్ హెలికాప్టర్ ఎక్కింది తన శరీరం ఒక్కటంటే ఒక్క ఇడ్లీతో పోషింపబడుతూందని ఆయన చెప్పడంలో, ఏమనుకోవాలి?

తిండి దగ్గరకూడా అసత్యాలుపలికే ముఖ్యమంత్రిని రాష్ట్రప్రజలు ఎట్లా నమ్మాలి.

తనకు ఆస్తి లేకపోవడం, కుమారులతో సంబంధం లేకపోవడం- ఈ శతాబ్దపు అతి

★ ఆశ్రమంతప్ప ఆస్తేమీ లేదట

★ అల్లుళ్ళనుసైతం పరిత్యజించాడట

★ కులమంటే ఏమిటో తెలియదట

★ పేదలకు సాయం చేస్తున్నానని పట్టణవాసులకు తనపై కోపమట

"ఇండియా టుడే" లో ముఖ్యమంత్రి అసత్యాల వెల్లువ

పెద్ద హాస్యోక్తి! అదే ఇండియా టుడేలో అదేపేజీలో ఆయన తన అల్లుడు చంద్రబాబునాయుడికి హైదరాబాదు బంజారా హిల్స్‌లో కట్టించి యిచ్చిన రాజప్రాసా



వైస్రాయి విశ్రాంతి గృహం కాదు - చంద్రబాబు రాజప్రాసాదం

దం బొమ్మకూడా వేశారు. (పైన కన్పించేది అదే).

ఇటువంటి పరస్పర విరుద్ధమైన ముఖ్యమంత్రి మాటలు, చేతలు ఆసంపాదకుడికి ఎంత చిరాకు కల్గించాయంటే, ఎన్టీఆర్‌కు 'డ్రామారావు' అని బిరుదు ఇచ్చారు. ఆయన వేషధారణ గురించి ఎంతో వెకిలిగా వ్యాఖ్యానం చేశారు; ఆయన కాషాయ దుస్తుల్ని హేళనచేశారు; ఆయన లోదాకులు, మెడలో లాకెట్లను ఎగతాళి చేశారు; ఆయన సినిమాభాష, పేర్లలో గొప్పగా కన్పించే 'విముక్తి', 'రామదండు' వంటి పథకాలు ప్రస్తావించి అవెంత అపహాస్యంపాలైంది వివరించారు. ఊరూరా, వాడవాడలా వెలుస్తున్న 'నందమూరినగర్' లను, 'తారక రామ ప్రాంగణా' లను ఎత్తిపొడిచారు.

ఒకటేమిటి, దాదాపు 20 లక్షల మంది మేధావులు, సమాజంలో ఎంతో ఉన్నతి, గౌరవంకల్గిన విద్యావంతులు చదివే ఈ పత్రికలో ఎన్టీఆర్‌ను ఒక జోకర్‌గా వర్ణించారు. అధ్యులకు ఆత్మాభిమానం అనేదివుంటే, దేశమంతటా దాన్ని ఎండగట్టారు! ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి గురించి ఇండియా టుడేవంటి ప్రసిద్ధ పత్రికలో ఇంత చిన్నతనంగా వ్రాయడం ఎప్పుడూ జరగలేదు.

ఈ సంపాదకులు కేవలం ఎగతాళితో సరిపెట్టుకోలేదు-ఎన్టీఆర్ కుటుంబ కుంభకోణాలుకూడా చాలావాటిని వెలికితీశారు. రామారావు, సత్యయ్యయాదవ్ అనేరైతుకు తొమ్మిది సంవత్సరాలక్రితం అమ్మిన పొలాన్ని దొంగచాటుగా తన సీలింగ్ భూమిక్రింద చూపించి, ప్రభుత్వానికి స్వాధీనంచేశారట. 182 ఎకరాల పొలంఇది. ఆరైతు లబోదిబో మంటూ కోర్టుకెక్కాడట. ఇంత మోసానికి దిగినవాడు మన ముఖ్యమంత్రి. సారాయిని బాట్లింగ్‌చేసి అమ్మాలని ఎన్టీఆర్ సుతీసుకున్న నిర్ణయంవెనుక, స్వంతలాభం వుందన్న ప్రతిపక్ష నాయకుల ఆరోపణ పూర్తిగా నిజమంటాడావిలేఖరి. ఈ కాంట్రాక్టు మొత్తం విలువ 32 కోట్లు.

ఎన్టీఆర్ ఆంధ్రరాష్ట్ర రాజకీయాలలో సినిమా చేష్టలతోపాటు, మతాన్నికూడా మిళితం చేయడాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించిందిపత్రిక. ఆయనమాత్రం తనకు దేవుడిపైన విశ్వాసంలేదని, తనలోనే దేవుడున్నాడని చెప్పారువారితో. అయితే ఆయన టేబుల్‌కి వెనుక, ముందు వెంకటేశ్వరస్వామి పటాలు పరుచుకొని వున్నాయి. వాటిని ఎదురుగా పెట్టుకునే, తనకు ఏ దేవుడిపైనా నమ్మకంలేదని చెప్పగలిగాడంటే ఇక ఆయన మాటలను ప్రజలు ఎట్లా విశ్వసించాలి? ఈ ధోరణిచూసేకాబోలు ఎన్టీఆర్ చేతలను 'పిచ్చిచేష్టలు'గా జమకట్టింది పత్రిక.

ప్రజల దృష్టిలో తానొక దేవుడిగా

—కొరకు 8వ పేజీలో



వెనుక, ముందు వెంకటేశ్వరస్వామి బొమ్మలు- 'నేనే దేవుణ్ని నాకు వేరేదేవుడు లేడు' అని మాటలు!

## పినాకినీ తీరం

**జి. కె. రెడ్డి**

ఈ సంవత్సరం మద్రాసు శ్రీ రాజలక్ష్మి ఫౌండేషన్ సన్మానం మన జి.కె. రెడ్డికి లభించబోతున్నది. వివిధరంగాలలో విశిష్టమైన సేవచేసినవారికి శ్రీ పి. వి. రమణయ్య రాజా ఏర్పాటుచేసిన ఈ ట్రస్టు ప్రతిసంవత్సరం రూ. 15000ల నగదు, ఒక ప్రశంసాపత్రంతో సన్మానిస్తుంది. అభ్యర్థి నిర్ణయం ఆగస్టు 15 తేది జరిగి, సన్మానం నవంబరు 19 తేది జరుగుతుంది.

శ్రీ జి. కె. రెడ్డిని తెలియనివారు దేశంలోనే తేరనుకొంటి; మన జిల్లాలో అసలు వుండరనుకుంటాను ఆయన మనజిల్లావాడు; నెల్లూరుతాలూకా కొత్తూరు వాసి; గునుపాటి సోదరులు అర్దరిలో సుబ్బరామరెడ్డి, రామచంద్రారెడ్డితర్వాతి వారు. ఏదేశమేగినా ఎందుకాలిడినా.... అన్నట్టు విశ్వవిఖ్యాతుడైన జి. కె. రెడ్డి స్వంతవూరును, స్వజనాన్ని మరచిపోడు. సంవత్సరానికొకసారి సకుటుంబంగా నెల్లూరుకు వస్తారు : స్వగ్రామం కొత్తూరుకు పోతారు; పెద్దగాళ్ళు మొదలు తెలిసిన ప్రతి ఒక్కరినీ పలుకరించి వస్తారు. నెల్లూరులో పరిచయస్తులందరినీ కలసుకోవడమో, కనీసం ఫోనులో పలుకరించడమో చేయకుండాపోరు. శ్రీ జి. కె. రెడ్డి జర్నలిస్టుగా ఎంత వున్నతశిఖరాల నందుకున్నారో; నమ్రత, నిగర్వత, సభ్యత సంస్కారాది గుణశీలాధిక్యతలలో అంతకంటే ఎక్కువ ఎత్తుకు ఎదిగారా అనిపిస్తుంది.

జి. కె. రెడ్డి జీవితాన్నిగూర్చి రాజలక్ష్మి ఫౌండేషన్‌వారు కొన్ని వివరాలు ఇచ్చారు: వాటిని అన్నిపత్రికలు ప్రకటించాయి. కాని జి.కె. రెడ్డిగారికి సంబంధించి పత్రికలలో రానివిషయాలు ఎన్నో వున్నాయి. వాటినిగూర్చి నాలుగు మాటలు చెప్పడమే నావుద్దేశ్యం.

నా అభిప్రాయంలో జి. కె. రెడ్డి ఒక 'హీరో' గా జర్నలిజంలో ప్రవేశించారు; కాంగ్రెస్ మొదటి చీలిక సమయంలో ముఠా రాజకీయాల విశ్లేషణ, విశేషాల వెల్లడింపుద్వారా దేశవ్యాప్తమైన కీర్తిగడించారు. జి. కె. రెడ్డి (గునుపాటి కేశవ



జి. కె. రెడ్డి

రాంరెడ్డి) నెల్లూరులో ఇంటర్ చదువుతూ, బహుశా మొదటి సంవత్సరంలోనే చెప్పకుండా వెళ్ళిపోయారు. ఆ వివరాలు ఆయన్ను నేనెప్పుడూ అడగలేదు గాని అక్కడనుండి బొంబయి చేరారు. అక్కడనుండి శ్రీనగర్‌లో స్థిరపడ్డారు. జర్నలిజంపట్ల ఆయనకు సహజంగానే ఆసక్తివుందో, ఎవరైనా కలిగించారో తెలియదుగాని, శ్రీనగర్ లో 'కాశ్మీరటైమ్స్' అనే ఇంగ్లీషు వారపత్రికను తన సంపాదకత్వంలో తెచ్చేవారు. ఆ పత్రిక మాకుకూడా వచ్చేది; 'జమీన్ రైతు'లో ప్రకటింపబడుతుండిన కొన్ని వార్తలు, ముఖ్యంగా కమ్యూనిస్టుల కార్యకలాపాలకు సంబంధించినవి, జి. కె

—కొరకు 10వ పేజీలో

# జనవాణి

## ఆందోళనకరం

రిజర్వేషన్ల వ్యతిరేక ఉద్యమం రోజురోజుకి ఉధృతమౌతున్నది; హింసారూపంకూడా ధరిస్తూంది. హైదరాబాదు నగరానికే పరిమితమైందనుకున్న తీవ్రత చిన్నచిన్న పట్టణాలకుకూడా వ్యాపిస్తూంది. విద్యార్థులు, విద్యార్థినులుకూడా విశేషమైన సంఖ్యలో కాలేజీలు వదలి బయటకు వస్తున్నారు; జాగువహిస్తే తమ భవిష్యత్తుకు సమాధి పడిపోతుందన్న ఆవేదనతో, పట్టుదలగా పోరాటానికి దిగుతున్నారు.

హైదరాబాదులోనేకాదు, రాష్ట్రంలో ఏమూలకూడా మంత్రులు తిరగలేకపోతున్నారు. తెలుగుదేశం నాయకులు ప్రజల్లోకి రావడానికే జంకుతున్నారు. వైద్య, ఇంజనీరింగు కాలేజీలన్నీ మూతపడ్డాయి. మామూలు కాలేజీలుకూడా మరెన్నోరోజులు నడుస్తాయన్న నమ్మకంలేదు. ఒక విద్యాసంవత్సరం వృధాకాబోతున్నది. అసలే ఉద్రిక్తంగావున్న పరిస్థితులలో సెక్రటేరియట్‌లో 3వేది జరిగిన దుర్ఘటన విద్యార్థుల ఆవేశాన్ని మరింత పెంచింది. తల్లిదండ్రులలో ఉద్యమంపట్ల ఎంత సానుభూతి వున్నదీ, వారి మనసులు ఆవేదనతో ఎంత భగభగ మండుతున్నదీ తెలుసుకోవడానికి ఈ సంఘటనే సాదృశ్యం. వారి హృదయాలు ఎంతగా గాయపడకుంటే, మహిళా ఉద్యోగినులుకూడా ముఖ్యమంత్రిఅంతటివాడిపై విరుచుకుపడతారు?

పరిస్థితులు ఒకవైపు తీవ్రరూపం దాలుస్తున్నా, ముఖ్యమంత్రిమాత్రం తన మొండిపట్టు విడువకపోవడం దురదృష్టకరం, విద్యార్థి, ఉద్యోగ, రాజకీయపార్టీల ప్రతినిధులెవరితో సంప్రదించకుండా, దుందుడుకుగా రిజర్వేషన్ల నిర్ణయం తీసుకోవడం ఎన్టీఆర్ చేసిన తప్పు. మూడు సంవత్సరాలు మూలపడివుండిన మురళీధర్‌రావు కమీషన్ నివేదికను మరొక మూడునెలలు వాయిదావేసి, అందరితో చర్చించినతర్వాత ఒకనిర్ణయానికి వచ్చివుంటే ఏపేచీ లేకుండాపోయేది. అయితే తన సహజ నిరంకుశ ప్రవృత్తిని, భావితరం భవిష్యత్తునే శాసించే విధాన నిర్ణయంలోకూడా వర్తింపజేయడంతో ఇప్పుడు పరిస్థితి చేయిదాటిపోయింది.

వెనుకబడిన తరగతులవారికి రిజర్వేషన్లు వుండకూడదని ఎవరూ అనరు; అయితే అవి ఇతరవర్గాల ప్రజల గొంతుకోసేవి కాకూడదు. తరతరాలుగా సామాజిక న్యాయానికి నోచుకోలేక, ఆర్థికంగా అణగారిపోయిన ప్రజలను పైకితేవడం మంచిదే; అయితే ఇతరుల భవిష్యత్తుకు కట్టిన సమాధులపై ఆ ప్రయత్నానికి పునాది వేయబూనడం నేరం.

ముఖ్యమంత్రి ఇప్పటికైనా తన నిర్ణయాన్ని పునఃపరిశీలించుకోవడం సమంజసమౌతుంది. విద్యార్థి ప్రతినిధులు, మేధావి వర్గాలతో ఈ సమస్యపై తక్షణం, కూలంకషమైన చర్చజరపడం ఆయన బాధ్యత. రిజర్వేషన్లను ఎటూ పైసంవత్సరం నుంచి అమలు చేస్తామని ప్రభుత్వం హైకోర్టుకు హామీయిచ్చింది. ఈ మధ్యకాలంలో ఎన్టీరామారావు ఉద్యమకారుల సమస్యల పరిష్కారానికి మార్గాలన్వేషించగల్గితే, రాష్ట్రం ఒక పెద్ద ప్రమాదంనుంచి బయటపడుతుంది. అసలు ఏడాది తర్వాత అమలుచేసే రిజర్వేషన్లకు ఇప్పుడెందుకిట్లా హడావుడి నిర్ణయం తీసుకున్నారు?

రిజర్వేషన ఉద్యమాలు సమాజాన్ని ఎంత సంక్షుభితం చేస్తాయో, విపత్తుల్యమైన పరిణామాలు కల్గిస్తాయో మనకు గుజరాత్‌లో ప్రత్యక్షంగా అనుభవమైంది. ఈ ఆందోళన కులాల మధ్య వైమనస్యాలు పెంచి, వర్గపోరాటాలు రెచ్చగొట్టే ప్రమాదంకూడా వుంది. అదేజరిగితే రాష్ట్ర భవిష్యత్తుకు గొడ్డలిపెట్టవుతుంది; భావితరం బ్రతుకు దుర్భరమౌతుంది. రెండు ప్రత్యేక రాష్ట్ర ఆందోళనలతోనే ఆంధ్ర రాష్ట్రం అభివృద్ధి దశాబ్దాల వెనక్కు పోయింది. ఇప్పుడింకొక ఉద్యమాన్ని కొనితెచ్చుకుంటే, 21 వ శతాబ్దం వచ్చినాకూడా, మనం 20 లోనె వుండిపోతాం. ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు మూర్ఖపు పట్టుదలమాని, విద్యార్థి ప్రతినిధులతో సామరస్యంగా చర్చలుజరిపి, సమస్య పరిష్కారం సాధించడం అవసరం. విద్యార్థులుకూడా తమ ఆందోళన హింసారూపం ధరించకుండా నిగ్రహం పాటించడం మంచిది.

---

## జమీన్ రైతు

4.9.1936

### నెల్లూరు ముచ్చట్లు

నెల్లూరుజిల్లా హెల్తు ఆఫీసరుగారు స్ప్రెసు లివరుకు ఆయుర్వేదంలో మందులేదని ధణుతెగిరి పొయ్యేటట్టు లెక్చరు గొట్టారుమొన్న. ఏకసాటి జ్ఞానం లేకనేనా గురుస్వామి మొదలియార్‌గారు జమ్మి వెంకట్రామయ్యగారి లివరుకు చీటి వ్రాయడం రఘునాథ సింగుగారు జండువారి లివరు నుపాశ్రయించడం?

• • •

చెట్టులేని వూళ్ళో ఆముదపుచెట్టే మహావృక్షమన్నట్లు మన హెల్తు ఆఫీసరుగారి వాగ్ధాటి ప్రవాహానికి అడ్డేది. అదియుదీ రెండు తెలియని మహాసభలో. ఆయుర్వేద ప్రభావం అర్థం కావాలంటే మేజర్ శంకరశాస్త్రివంటి వారి గ్రహణ పారీణులనడిగి తెలుసుకుంటే అర్థమౌతుంది.

• • •

పున్నేపల్లి కరబల్లవోలు మోపూరు గ్రామస్తులు సంవత్సరంనాడు గ్రామ పంచాయితీలు పెట్టమని పంచాయితీ ఆఫీసరుకు అర్జీలు పెట్టారు, యింత వరకు దంగా యుధపురంలోనో, గూడూరు తాలూకాలలోనో సమాక్ చేస్తున్నది. ఇమింద్రాలలో పంచాయితీలు పెట్టకూడదనే కుమార రాజా సాహెబుగారి ఉత్తర్వు ఇంకా ఉపసంహరించుకోలేదు కాబోలు?

• • •

### వివిధ వార్తలు

అండమాను దీవులలో పరిస్థితులను తెలుసుకొనివచ్చి ఇండియా దొరతన మునకు నివేదించుటకు ఇండియా దొరతనము భారత శాసనసభ్యులను కొందరిని పంపతలచినది. అక్టోబరు 29 తేదిన వీరు బయలుదేరెదరు.

• • •

రాజమండ్రి వేణుగోపాలస్వామి ఆలయముపకు వెంకటగిరి ఎస్టేటులో గల భూముల శాలూకు శిస్తు షుమారు రూ 3500 వరకు బకాయి పడెను. వేణుగోపాలస్వామి భక్తులగు హిజ్ ఎక్సలెన్సీ సర్ కె. వి. రెడ్డినాయుడు గారి మాటమీద వెంకటగిరి జమీందారుగారు ఆ బకాయి బాకీని రద్దు చేసిరి.

• • •

1934 లో ఇండియాలో 30 బ్యాంకులు దివాలాతీసినవి. అందు 11 బెంగాలు, 9 మద్రాసునకు చెందినవి. బొంబాయిలో 5, తిరువాన్కూరులో 3, ఢిల్లీలో 2.

### బోసుగారి నిర్బంధము

బోసుగారి నిర్బంధమును గురించిన నేరమును కోర్టులో విచారణజేసి బహిరంగముగా రుజువుపరచుటకు వీలులేదని భారత శాసనసభలో హోం మెంబరుగారు తెలిపిరి.

• • •

గాంధిగారి గ్రామ నిర్మాణోద్యమును నెరవేర్చు కాంగ్రెసు సేవకులు కొన్నివిషయములలో ప్రభుత్వము వారి తోడ్పాటును కోరినచో జిల్లా అధికారులీవిషయమును రాష్ట్ర ప్రభుత్వములకు తెలియ చేయవలెనని ప్రభుత్వమువారికి సర్క్యులరు పంపిరని హోం మెంబరు అసెంబ్లీ తో తెలిపిరి.

### మితవాదులసభ భగ్నమగుట

పూనాయందు కవాస్జీ జహంగీరు గారి అధ్యక్షతక్రింద మితవాదుల ఎన్నికల ప్రచారక సభయందు కాంగ్రెసు వారి ఎన్నికల ప్రణాళిక విమర్శింపబడగా ప్రేక్షకులు తుఫ్ఫాన గుడ్లను విసరి అల్లరిచేసిరి.

### 50 ఏళ్ల క్రితం ఈవారం

---

# లిథియం లోహంతో నెల్లూరు పరిశ్రమలకు కేంద్రం కావాలి!

కొన్నిదేశాలు తమకు ఖనిజాలు లేక, ఇతరదేశాలనుండి దిగుమతి చేసుకొంటుంటే, మన ప్రభుత్వం మనదేశంలోనే అపారమైన ఖనిజసంపదను పెట్టుకొని, ఇతరదేశాలపై ఆధారపడుతున్నది, మన దేశంలో అసలు ఖనిజసంపదపై సమగ్ర పరిశోధనచేసే నాధుడేలేదు. ఈమధ్యనే నెల్లూరుజిల్లాలో గూడూరువద్ద భూగర్భ పరిశోధనలో అతి అరుదైన అతితేలికైన 'లిథియం' (Lithium) లోహ నిక్షేపాలు బయటపడ్డాయి. ఈ లోహం అల్యూమినియంకన్నా తేలికైనదని శాస్త్రజ్ఞులు ప్రకటించారు. అంతే కాకుండా ఈ లోహ నిక్షేపాలను వెలికి తీస్తే, ఈనాటి 'ఎలక్ట్రానిక్స్' రంగం రూపురేఖలు మారిపోవచ్చునని శాస్త్రజ్ఞులు ప్రకటించారు. 'లిథియం'లోహంను వెలికితీస్తే నెల్లూరు,గూడూరు ప్రాంతంలో 'ఎలక్ట్రానిక్స్' రంగానికి సంబంధించిన పరిశ్రమలు నెలకొల్పవచ్చు. ఎలక్ట్రానిక్స్ సంబంధించిన పరిశ్రమలు ఈ ప్రాంతంలో పెడితే జిల్లా పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి సాధిస్తుంది. ఖనిజసంపద లేనిజిల్లాలు పారిశ్రామికంగా అభివృద్ధి సాధిస్తుంటే, ఖనిజ సంపద వుండికూడా మనజిల్లా పారిశ్రామికంగా వెనుకబడివుంది. ఈ విషయంలో జిల్లా మంత్రిగారు ఏమాత్రం శ్రద్ధవహించినట్లులేదు. అలాగే గూడూరు వద్ద దొరికే 'మైకా'కు సంబంధించిన పరిశ్రమను ఈ ప్రాంతంలో నెలకొల్పాలి. జిల్లాలోని 'సోమశిల' వద్ద అణుశక్తి కొరకు ముఖ్యఅవసరమైన 'యురేనియం' నిక్షేపాలున్నాయని పరిశోధకులు ప్రకటించారు. కాని తర్వాత దానిమీద ఎటువంటి పరిశోధన జరగలేదు. అంత నిర్లక్ష్యం మనవారికి! జిల్లాలో బయల్పడిన 'లిథియం' లోహమును వెలికి తీయించి. దానికి సంబంధించిన పరిశ్రమలు నెలకొల్పి, అటు రాష్ట్రాన్ని ఇటు జిల్లాని పారిశ్రామి



కంగా అభివృద్ధి చేయవలసిన బాధ్యత రాష్ట్ర నాయకులపై జిల్లానాయకులపై ఎంతోవుంది ముఖ్యంగా జిల్లా మంత్రి గారు ఎక్కువ శ్రద్ధవహించాలి

సంగం -జి. వాసు.

### సైనిక్ ఫించను దారులకు విజ్ఞప్తి

స్వతంత్ర సైనిక సన్మాన ఫించను పథకం క్రింద పెండింగ్ దరఖాస్తులను పరిశీలించడానికి కేంద్రప్రభుత్వం 15 తేది వరకు గడువు పొడిగించింది. ఇతే సైనికులు ఫించను వ్యవహారాలు చూసేందుకు తెలంగాణాలో అనధికార సలహా సంఘాలు వున్నాయికాని. ఆంధ్ర ప్రాంతంలో మాత్రం ఫించను సంగతి పట్టించుకునేవారే లేరు. అందువల్ల మిత్రుల ప్రోత్సాహంతో ఈ విషయంలో సేవ చేయడానికి నిర్ణయించుకున్నాను. ఫించను పెండింగు దరఖాస్తుదారులు తమపేరు, తండ్రిపేరు, చిరునామా, సంక్షిప్త చరిత్ర తెల్పుతూ, నా పేరుతో 3-4-885/3, బర్కత్‌పురా, హైదరాబాదు-500 027 అడ్రసుకు వ్రాయాలని విజ్ఞప్తిచేస్తున్నాను. కేంద్రప్రభుత్వం నుంచి ఏవైనా కాగితాలు వచ్చివుంటే, వాటి జెరాక్స్ కాపీలుకూడా పంపండి.

—కొరవ 8వ పేజీలో



ఆంధ్రాబ్యాంకు ఛైర్మన్ ఎం. వెంకటరత్నం బ్యాంకు పక్షంగా ఐదు, బ్యాంకు సిబ్బంది తరఫున ఐదు — మొత్తం పదిలక్షల రూపాయల చెక్కును గోదావరి వరదబాధితుల సహాయానికిగా ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుకు సమర్పిస్తున్న దృశ్యం

# సౌత్ స్టేషన్ బ్రిడ్జి నెల్లూరుకు శాపమే!

నెల్లూరు టవున్‌లో గుక్కతిప్పుకో దానికి దుక్కనీళ్ళులేవు; సౌత్ స్టేషన్ అండర్‌బ్రిడ్జివద్దతప్ప!

వర్షంలేదు గిర్షంలేదు; సోమవారం (1 తేది) ఉదయం బ్రిడ్జిక్రింద మోకాటి లోతు డ్రెయినేజినీళ్ళు! చిన్నవాహనాలు దాటడానికిలేదు; పెద్దవి దాటుతుంటే ముక్కులు గట్టిగా మూసుకున్నా పేగులు బయటకువచ్చేంత గబ్బు! నెల్లూరుకు ఇది సౌకర్యమో, శాపమోమరి!!

వానవస్తే నిండిపోతుంది; రాకపోకలు రోజులపర్యంతము నిల్చిపోతవి! వర్షం

### నెల్లూరు సంగతులు

లేనప్పుడు డ్రెయినేజి లీక్‌తో నిండిపోయి రాకపోకలకు ప్రతిబంధకం ఏర్పడుతుంది. దీనికి అమ్మ అబ్బలేరా? ఎప్పటి నీళ్లు అప్పుడు తోడేసి, రాకపోకలకు ఆటంకంలేకుండా చేయులేరా? ఇది ముఖ్యప్తపు మునిసిపాలిటీనా? లేక రాకపోకలకు ఆటంకరించని రోడ్లు భవనాలశాఖదా?

#### రైతుసదస్సు

అఖిలపక్ష రైతుసదస్సు ఇటీవల టౌన్‌హాల్‌లో జరిగింది. సభకు కార్యాచరణ కమిటీ కన్వీనరు ప్రొఫెసర్ పి. సి. రెడ్డి అధ్యక్షత వహించారు. ఎమ్మెల్యే శ్రీ జక్కా వెంకయ్య, జిల్లా కమ్యూనిస్టు సమితి కార్యదర్శి శ్రీ గునుపాటి రామచంద్రయ్య, జిల్లా జనతాపార్టీ అధ్యక్షుడు శ్రీ యస్.యస్. రాయల్ రెడ్డి, జిల్లా చెరకు ఉత్పత్తిదారుల సంఘం అధ్యక్షుడు శ్రీ మాదాల తిమ్మయ్య, జిల్లా రైతుసంఘం అధ్యక్షుడు శ్రీ బసాని రెడ్డి శంకరయ్య, కార్యదర్శి శ్రీ గండవరం సేతురామరెడ్డి, జనతాపార్టీ జిల్లా రైతు విభాగనాయకుడు శ్రీ కాటంరెడ్డి రామచంద్రారెడ్డి రైతు సమస్యలగురించి మాట్లాడారు.

తర్వాత కరువుప్రాంతాల్లో విద్యుత్ బాకీలను రద్దుచేయాలని, దుర్భిక్ష ప్రాంతాలలోని సహకార, వాణిజ్య, వ్యవసాయ అభివృద్ధిబ్యాంకులు రుణాల వసూళ్ళను వాయిదావేయాలని హైకోర్టుఆదేశం మేరకు నెల్లూరుజిల్లాలో అన్నిరకాల రుణాలను నిలిపివేసి, రీ షెడ్యూలు చేయాలని పెన్నానది ఆయకట్టుక్రింద విధించిన డ్రైనేజి పన్ను రద్దుచేయాలని తీర్మానాలు చేశారు.

#### వాలీబాల్ పోటీలకు ఎంపిక

ఆంధ్రప్రదేశ్ అంతర్‌జిల్లాల జూనియర్ వాలీబాల్ పోటీలు 13 తేదినుండి

—కొరవ 10వ పేజీలో



### ఒంగోలు వార్తలు

## కటకటాల్లో కాంగ్రెసు నాయకులు

మహానుభావుడు శ్రీ వెంగళరావు శ్రీకాకుళం జిల్లాకాంగ్రెస్ కమిటీని ఏ సుముహూర్తాన నియామకంచేసి వెళ్లాడో గాని అది దినదినం గొడవగా కీచులాటగా వర్ధిల్లుతోంది. డి సి సి అధ్యక్షుడు శ్రీ అంగలకుర్తి బాలయ్యకు ప్రధాన కార్యదర్శి శ్రీ తనుపుతేటి మాల కొండయ్యనాయుడికి మధ్య ఉప్పు గడ్డి వేస్తే భగ్గుమంటుంది. జిల్లాలోని ఏ కాంగ్రెసు కానసభ్యుడికీ, చిన్నటిదాకా సమితులేలిన కాంగ్రెసు సమితి రాజులకీ బాలయ్య నీడ గిట్టదు. ఈ పోరాటం డి. సి. సి. నియామకం నాటినుంచి కొనసాగుతున్నదే. సరే ఇది అన్ని జిల్లాల్లో సర్వసహజమైందేగదాని కొట్టేసినా, ఇటీవల విజిలెన్సు దాడుల్లో డి. సి. సి. అధ్యక్ష కార్యదర్శులు పట్టుబడడం జిల్లాలోని కాంగ్రెసు అభిమానులందరికీ తల కొట్టేసినంత అవమానకరంగావుంది.

ప్రకాశంజిల్లా కాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శులిద్దరూ కిరసనాయిలు వ్యాపారస్తులే. కేవలం ఒకటిరెండ్లు స్వల్పకాలంలోనే యిద్దరూ సిరుల గిరులకెగబ్రాకినవారే! అయితే యిద్దరు ప్రముఖుల పోటీ వ్యాపారరంగానికే పరిమితం కాకుండా రాజకీయ రంగానికికూడా విస్తరించింది. అక్కడి అనారోగ్య వాతావరణమే యిక్కడా నెలకొంది.

రెండుమాసాల ముందు జిల్లాకాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి తనుపుతేటి మాల కొండయ్య నాయుడి పెట్రోలు బంకు మీద విజిలెన్సు దాడిజరిగింది. ఆ సమయంలో డీజిల్‌లో కిరసనాయిలు కల్తీ చేస్తూ, దుకాణంలో వున్న నాయుడి కొడుకు పట్టుబడి, రిమాండుకు పంపబడ్డాడు. ఆ తర్వాత మాలకొండయ్య నాయుడు యాంటిసిపేటరీ బెయిలుతో కటకటాల లెక్క తప్పించుకున్నారు. అప్పట్లో ఈ దాడివెనక డి.సి.సి. అధ్యక్షుడు బాలయ్య చెయ్యి ఉందని టౌన్లో పుకారుండింది.

కార్యదర్శి అరెస్టు జిల్లాజనం మరిచి పోకముందే విజిలెన్సువాళ్ళు అధ్యక్షుడి

మా విలేఖరి

కిరసనాయిల్ దుకాణంమీద దాడిజరిపి అవకతవకలున్నాయని అయన్ను అరెస్టు చేశారు. శనివారం సాయంత్రం అరెస్టు చేస్తే, ఆదివారం ఉదయం ఆస్పత్రికిచేరి అక్కడెలాగో తిప్పలుపడి బాలయ్య బెయిలు సంపాదించుకున్నాడు. ఈ అరెస్టు వార్త ప్రాకారని బాలయ్య విలేకరిమీద చిందులుతొక్కారట. చీరాలలో కాంగ్రెసు సమావేశానికి వెళ్ళిన విలేకర్లను గెటౌట్ అన్నాడట. దాంతో అక్కడి విలేకర్లంతా ఆగ్రహించి, వెంటనే సమావేశమై జిల్లా కాంగ్రెసు వార్తల్ని పూర్తిగా నిషేధించాలని ఒక తీర్మానం చేశారు.

జిల్లాలో జనం కాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శుల్ని అంతగా అనుకోవడం లేదు. వారు అక్కడివారికికొత్తగాదుగదా! అయితే ఈ ఆణిముత్యాల్ని ఏరి జిల్లా కాంగ్రెసు మణిహారంలో అలంకరించి వెళ్ళిన శ్రీ జలగంవారి ప్రతిభను కోటి గొంతులతో కొనియాడుతున్నారు. ★

## బాలయ్య తెలుగుతీర్థం స్వీకరిస్తారా?

ఒంగోలు మున్సిపాలిటీ మాజీఛైర్మన్ శ్రీ బచ్చల బాలయ్య తెలుగుదేశంలో చేరతారన్నప్రచారం ఒంగోలుపట్టణంలో ప్రబలంగా వినిపిస్తోంది.

కడపజిల్లా నుండి వ్యాపారపరంగా ఒంగోలు వచ్చిన శ్రీ బాలయ్య ఎక్సైజు కాంట్రాక్టరుగా స్థిరపడ్డాడు. పెద్ద కాంట్రాక్టరుగానే పేరు తెచ్చుకున్నారు. అప్పటి మంత్రి శ్రీ రొండా నారపరెడ్డి అండదండలతో అంచెలంచెలుగా ఎదుగుతూ వచ్చారు. చివరికి ఆయన మనిషిగానే రాజకీయాల్లోకి ప్రవేశించి, మొన్నటి మున్సిపల్ ఎన్నికల్లో ఛైర్మన్ కాగలిగారు. శ్రీ నారపరెడ్డిపట్ల విశ్వాసం, విధేయతా ఇప్పటికీ ప్రదర్శిస్తూ కాంగ్రెస్ వాదిగానే చలామణి అవుతున్న శ్రీ బాలయ్య తెలుగుదేశం ప్రవేశం వార్త ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది.

అయితే రాబోయే మున్సిపల్ ఎన్నికల్లో ఛైర్మన్ ఎన్నిక పార్టీ టిక్కెట్టుమీద నేరుగా నిర్వహింపబడుతుందన్న ఊహాగానం కారణంగా బహుశా ఈసారు గెలుపుగట్టెక్కడానికి, తిరిగి ఛైర్మన్‌పదవి చేపట్టడానికి శ్రీ బాలయ్య 'దేశం'ప్రవేశం చేయగల అవకాశాలున్నాయని అంటున్నారు.

కానీ ఈ విషయంలో వాస్తవాల్ని

—కొరవ 11వ పేజీలో

## సమాజంలో వైశ్యులకు విలువ పెంపొందింపజేయాలి!

నెల్లూరులో వైశ్యుల జనసంఖ్య అధికంగా వుందన్న విషయం అందరికీ తెలుసు కానీ, వారిలో ఇంతటి సంఘీభావంకూడా వుందన్నసంగతి మొన్నటిదాకా తెలియదు. 30, 31 తేదులలో జరిగిన జిల్లా ఆర్యవైశ్య మహాసభలు ఆడంబరంగానేకాదు, వైశ్యులలోఅపూర్వ ఉత్సాహాన్ని, సమైక్యతను ప్రబోధించే విధంగా జరిగాయి. సమాజం యావత్తు ఏకులానికాకులంగా, ఏమతానికామతంగా ఏ గోత్రానికాగోత్రంగా చీలిపోవడం; ఎవరికి వారు స్వంతకుంపట్లు పెట్టుకొని, ప్రక్కింటివాణ్ని పరాయివాడిగా చూడడం దేశభవిష్యత్తుకు, జాతిమనుగడకు క్షేమకరం కాకపోయినప్పటికీ, కేవలం సభల వరకే దృష్టిసారించిచూస్తే చాలా గొప్పగానూ జరిగాయి.

సభావేదికకూడా, ఆర్యవైశ్య సత్రమే! దర్గామిట్ట, టి. టి. డి. కళ్యాణమంటపం ఎదురుగా. దశాబ్దాలతరబడి దిక్కుదివాణం లేకుండా, పాడుబడి పిచ్చిచెట్లు మొలుస్తుండిన ఈ సత్రం, సభల పుణ్యమా అని జిగ్‌జిగేల్ మన్నది. పాచిపట్టిన గోడలకు సున్నంపూతపూసి, ఆవరణమంతా పందిళ్ళువేసి, తివాచీలు పరిచి, విద్యుత్ తోరణాలు వ్రేలాడదీసి, అబ్బా అన్పించారు.



30 తేది ఉదయం రాష్ట్ర సంఘం అధ్యక్షుడు శ్రీ సంఘశ్రీ వీరవెల్లి వరసింహారావు పతాకావిష్కరణతో సభలు

మొదలయ్యాయి. జిల్లా అధ్యక్షుడు శ్రీ సోమిసెట్టి కాశయ్య వాసవి పతాకం ఎగురవేశారు. మాజీ మంత్రి శ్రీ కె. రోశయ్య జ్యోతి వెలిగించారు.

మొదట జిల్లా, రాష్ట్ర సంఘాల కార్య నిర్వాహక సమావేశాలు: జిల్లా కార్యదర్శి శ్రీ కె. వి. చలమయ్య నివేదిక చదివారు. వచ్చే ఎన్నికలలోనైనా, వైశ్యులు నెల్లూరులో ఎమ్మెల్యేలు కావాలని ఆకాంక్షించారు. సాయంత్రం 4 గంటలకు సర్వసభ్య ప్రత్యేక ఆహ్వానితుల సమావేశం. శ్రీ రోశయ్య ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీ మాదాల వాల

—కొరవ 10వ పేజీలో

# నీటిదొంగలు పట్టుబడ్డారు — కొళాయిలకు చెర వదిలింది!

గతవారం మునిసిపాలిటీ నీళ్ళు సరఫరా చేయలేకపోయిందని రచ్చరేగితే, ఈవారం వున్ననీళ్ళను పెరుక్కొంటుంటని గూడూరులో గగ్గోలైపోయింది. సరఫరా సరిగా లేదని దారిన పోయేవారంతా తలాఒకమాట అన్నారని పురపాలకాధికారులకు రోషం కల్గిందేమో, పూరిమీదపడి నీటిదొంగలనంతా దొరకపుచ్చుకుని, సంచలనం సృష్టించారు. గొట్టాలకు మోటార్లు బిగించుకుని ఉద్రుతంగా వందలగ్యాలన్ల నీళ్ళు తన్నుకుపోతున్న పెద్దమనుషులందరికి దీంతో గొంతులో పచ్చివెలక్కాయ పడినట్లయింది. మునిసిపల్ అధికారులు మోటార్లు పీకిపారేయడంతో పూరుకోక, వారందరికి కొళాయి కనెక్షన్లు పూడబెరికారు. కాళ్ళావేళ్ళాపడినా కనికరించలేదు. దాంతో అందరూ కోర్టును శరణు వేడి స్టే తెచ్చుకున్నారు.

ఇప్పుడు చాలా కొళాయిలకు స్వేచ్ఛ లభించింది. నీరు వస్తోంది. దూడలవారి వగర వున్న పాడుబడ్డ బావిని రిపేరు చేయడంతో సరఫరా మరింత మెరుగైంది

### గూడూరు వార్తలు

అధికారులు రాహసమైనప్పుడు బావిత్రవ్వడం కాకుండా, ముందుగానే జాగ్రత్తపడి వుంటే, ఇంత గొడవేలేదుగదా!

**రిజర్వేషన్ల ఉద్యమానికి తల్లిదండ్రుల ఆశీర్వాదం**

రిజర్వేషన్లను, వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న గూడూరు విద్యార్థులు, తల్లిదండ్రుల సమావేశం ఒకటి ఏర్పాటుచేసి వారి ఆశీర్వాదం పొందారు. ఈ సమావేశానికి డాక్టర్ వై. బ్రహ్మారెడ్డి అధ్యక్షత వహించారు. విద్యార్థులు తమ వాదాన్ని చక్కగా వివరించారు. వారి వాగ్ధాటికి ముగ్ధులై, అందరూ ఉద్యమానికి తమ అండ వుంటుందని ప్రకటించారు. శ్రీ మదనమోహనను, తల్లిదండ్రుల సంఘం అధ్యక్షుడుగా నియమించారు.

**చెన్నూరు శ్రీకృష్ణజయంతి**

శ్రీకృష్ణజయంతి సందర్భంగా 27 వతేది చెన్నూరు లలితకళామందిర్ ఆధ్వర్యంలో సాహిత్యోపన్యాసాలు జరిగాయి. సంస్థ ఉపాధ్యక్షులు శ్రీ ఎం. జామయ్య

—కొరవ 8వ పేజీలో

### కన్నీళ్లుతుడిచే సహాయం వద్దు!

మాతభూమి. సంపత్‌కుమార్

నిండినిండి గాండ్రించిన
మేఘంలేని అమాయకంగా
చూసి ఆ జనాన్నిచూసి
ఏమని ఓదారుస్తావు?

నీళ్ళు పాలిచ్చిన
పూతనమ్మ గోదారమ్మ
పక్కన ఎట్టా
పడుకోమంటావు?

ఎందరికో అన్నంపెట్టిన
చేతుల్ని అన్నం పొట్లం
కోసం ఆకాశంవైపు
చేతులు చాచమంటావా?

ఏడ్చిన ఏడుపు
ఏడవకుండా ఏడ్చి

ఎందరి కన్నీళ్ళు
నీళ్ళల్లో నీళ్లయ్యాయి!

ఇదేం ఉగాది పండగా
వచ్చిసారి తప్పకుండా
అల్లుళ్ళ మాదిరిగా
వచ్చి పోవడానికి

కన్నీళ్ళు తుడిచే
సహాయాలు వద్దు
కన్నీళ్ళు రాని
ఉపాయాలు చూడండి!

కాయితాల్లో నుంచి
ప్రాజెక్టుల్ని కార్యాల్లోకి
మార్చండి, గోదారమ్మ
సైర్యానికి సంకెళ్ళెయ్యండి!

# అల్లూరు రైస్‌మిల్లర్లను కరెంటుశాఖ కాల్చుకతింటుందట

విద్యుత్‌శాఖ తమను చిత్రహింసల పాల్జేస్తుందని, అల్లూరు రైస్‌మిల్లుల యజమానులు లబోదిబోమంటున్నారు. వారానికొకసారి విజిలెన్సు అధికారులు దాడులుచేస్తున్నారట. కెపాసిటర్లు పెట్టలేదని కొందరిదగ్గర వేలరూపాయలు పెనాల్టీలు గుంజితే, మరికొందరిపై కెపాసిటర్లకు ఫ్యూజులు లేవని కేసులు పెడుతున్నారట. అయితే, కెపాసిటర్ ఎంత కెపాసిటీతో పెట్టాలో చెప్పరట. కెపాసిటర్లకు ఫ్యూజులుంటాయనే సంగతే మాకు తెలియదు - అవి కాలిపోతే మాకెట్లా బాధ్యత అంటారు వీరు.

### జిల్లావార్తలు

కరెంటుబిల్లుల విషయంలోకూడా ఇటువంటి ఇబ్బందులెదురౌతున్నాయట. మొన్నికరోజు, 85 లో ఒకనెలబిల్లు చెల్లించలేదని, ఒక రైసుమిల్లుకు కరెంటు ఊడబెరికారట. సంవత్సరంనుంచి బిల్లు కట్టని విషయం ఎందుకు చూడుకోలేదు, అప్పుడే ఎందుకతగలేదు అన్నది వీరి ప్రశ్న-నిజమేకదా! పోనీ ఆబిల్లు కడతామనిపోతే ఆ మొత్తమెంతో, ఏ. ఇ. లు చెప్పలేకపోయారట.

అడిషనల్ లోడుకు 81లో అనుమతి తెచ్చుకున్న రైసుమిల్లులనుకూడా 88లో సీల్ చేస్తామని బెదిరించారట. ఈ ఐదేళ్ళకాలంలో ఫలానా రైసుమిల్లుకు అనుమతి వుందన్న సంగతి తెలుసుకోలేక పోయారన్నమాట.

రైసుమిల్లులలో కరెంటు చోరీలు నివారించటం అవసరమే; కాని అకారణాలతో చీటికీమాటికి వారిని చిక్కులపాల్జేయటం సమంజసంకాదు; కావలి డి ఇగారు తమ సిబ్బందిని అదుపులో పెట్టాలి!

# శ్రీకొలనులో మళ్ళీ హత్య

ఆత్మకూరు తాలూకా శ్రీకొలనులో మరో హత్య జరిగింది. 29 వతేది రాత్రి యల్లవ నరసారెడ్డి (70) అనే వృద్ధ రైతును ఎవరో చంపిపారేశారు. ఆయన పొలంలో వడుప్పలకు కాపలిగా, ఒంటరిగా వున్నాడట ఏరాత్రప్పుడు ఎవరు వచ్చి ఈ ఘాతుకానికి పాల్పడ్డారోగాని, తెల్లవారి గ్రామస్థులకు శవంమాత్రం దొరికింది

### ఆత్మకూరు పోరం

పంచాయతీ ఎన్నికల తర్వాత గ్రామంలో ఇది రెండవ హత్య. రెండు నెలలక్రితమే, ప్రస్తుత సర్పంచ్ నంది రామచంద్రారెడ్డి వర్గానికిచెందిన ఒక యువకుడ్ని చంపారు. ఆకేసులో మాజీ సర్పంచ్ మాలకొండారెడ్డితోసహా 27 మంది అరెస్టయ్యారు. ఆకేసు పరిష్కారం కాకముందే అప్పారింకొకహత్య; ఇందులో కూడా మరో 27 మందిని అరెస్టు చేశారట.

పంచాయతీ ఎన్నికల గొడవే ఈ కిరాతకాలకు కారణమట. అయితే ఇటీవలకాలంలో గ్రామస్థులందరూకలసి, రాజీపడి కలసిమెలసివుండాలని నిర్ణయించుకున్నారని, ఆ రాజీ ఒప్పందం భగ్నంచేయడానికి ఎవరో ఈ అమాయక వృద్ధుడ్ని బలితీసుకొని కక్షలు రెచ్చగొట్టారని అంటున్నారు. ★

**పొదలకూరు బి. డి. ఓ. పై అయ్యవార్ల ఆగ్రహం**

పొదలకూరు సమితి కనుపర్తి అప్పర్ ప్రైమరీ స్కూలు హెడ్మాస్టర్ శ్రీ సి. వైకుంఠరావును బి. డి. ఓ. బదలీ చేశాడట. రూల్సుప్రకారం డి. ఇ. ఓ. బదలీ చేయాలి. ఆ హెడ్మాస్టర్ ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ లో కేసు పెట్టాడు. వారు బి. డి. ఓ. బదలీ ఉత్తర్వులను నిలిపివేస్తూ స్టే ఇచ్చారట. అయితే, ట్రిబ్యునల్ ఇచ్చిన ఉత్తర్వులను బి. డి. ఓ. బుట్టదాఖలు చేశాడట. ఆయన నిరంకుశవర్తనను నిరోధించాలని ఆం.-ప్ర. టీచర్స్ ఫెడరేషన్ జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ అబ్దుల్ ఖాదర్ కలెక్టరును కోరుతున్నారు.

అయ్యవార్లను అధికార్లు ఎప్పుడూ ఉక్కులో నిప్పేనా?

**విద్యానగర్ కాలేజీ వరద విరాళం**

విద్యానగర్ ఎన్. బి. కె. ఆర్.,

—కొరవ 8వ పేజీ



# నూతులెండిపోయాయి- గొంతులు తడారాయి!

నీటికరువు జిల్లాలోని మిగతా రెండు మునిసిపాలిటీలలో వలె కావలిలోకూడా సాక్షాత్కరించింది. వెంగళరావు నగర్, వైకుంఠపురం, కచేరిమిట్ట పాతవూరు ప్రాంతాలలో మంచినీరు మృగ్యమైపోయింది. బావుల్లో నీటిమట్టం పాతాళానికి పోయింది. కొన్ని అసలే అడుగంటిపోయాయి. కొళాయిల్లో కూడా నీళ్ళు అంతంతమాత్రమే. ఇంకొకప్రక్క ఎండలు మండిపోతున్నాయి.

వెంగళరావు నగర్‌లోని పేదా సాదా నీటికోసం పడేబాధలు వర్ణనాతీతం. కొళాయినుంచి రాలే నీటిబొట్లకోసం జుట్టు జుట్టు పట్టుకోవలసి వస్తుంది; ఇంకొకప్రక్క పల్చగా నీరూరే బావులచుట్టూ బిందెలుపట్టుకొని రాత్రనక పగలనక తిరుగుతున్నారు. ఇంకొకవారం పదిరోజులు ఇట్లనే వుంటే, పరిస్థితి ఏమౌతుందో అనూహ్యం.

**వరదకు మందులు**

కావలి ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌వారు డాక్టర్లద్వారా సేకరించిన 7 పెట్టెల మందులు, రోటరీ, ఐ ఎం ఏ. సభ్యులమంది సేకరించిన 9 పెట్టెల గుడ్డలు గోదావరి వరద బాధితులకు పంపించారు. వీటి విలువ పదివేల రూపాయలు.

**కావలి లాయర్ల అలక తీరింది**

కావలి లాయర్ల అలక తీరింది-1 వతేది ఉదయం నుంచి కోర్టులకు హాజరౌతున్నారు. జుడిషియల్ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ శ్రీ జగన్నాధరావు పోలీసులకు సహకరిస్తున్నారన్న ఆరోపణతో రెండు నెలలుగా న్యాయవాదులు కోర్టులకు గైర్‌హాజరౌతున్నారు. దీనిపై కావలి కొత్త సబ్‌జడ్జి శ్రీ ఉపోత్తమ రెడ్డి, డిస్ట్రిక్ట్ మున్సిఫ్ శ్రీ రామకృష్ణారెడ్డి, జిల్లాజడ్జి శ్రీ శివసాంబమూర్తి ఇరుపక్షాల వారిని చర్చలకు పిలిచి, రాజీచేశారు. దానితో అలకతీరిన అడ్వొకేట్లు తిరిగి నల్లకోట్లు ధరించారు,

### కావలి కబుర్లు

**ఓపన్‌యూనివర్సిటీ కేంద్రం**

కావలి జవహర్‌భారతిలో ఓపన్ యూనివర్సిటీ కేంద్రం ప్రారంభమైంది. బాటనీహెడ్ శ్రీ దీపాల రాధాకృష్ణమూర్తి కోఆర్డినేటర్‌గా నియమింపబడినాడు. బి. ఏ., బి. కాం. విద్యార్థులకుమాత్రం ప్రస్తుతమిక్కడ తరగతులు నిర్వహిస్తారట.

**జవహర్ భారతి ఎన్నికలు**

జవహర్ భారతి కాలేజి విద్యార్థిసంఘానికి ఇటీవల ఎన్నికలు జరిగాయి. జాయింట్ సెక్రటరీతప్ప తక్కినవారందరూ డి. ఎస్ యు. అభ్యర్థులే! అధ్యక్షుడుగా శ్రీ ఎ. రాఘవరెడ్డి, ఉపాధ్యక్షుడుగా శ్రీ ఎస్. రామకృష్ణ. కార్య

—కొరవ 8 వ పేజీలో

## నెల్లూరు నాలుగ్గోడలు
### విహంగ వీక్షకుడు

### శ్రీనివాసులురెడ్డిగారికి అనారోగ్యం

రవిష్యామంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారు అనారోగ్యపీడితులైనారు. నాలుగురోజుల క్రితం ఆయనకు హఠాత్తుగా గుండెల్లో నొప్పి వచ్చిందట. వెంటనే నిజాం మెడికల్ ఆస్పత్రిలో చేర్పించారు. ఇప్పుడు కులాసాగా వున్నారు. అయితే డాక్టర్లు విశ్రాంతి తీసుకోమన్నారట. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు, ఆయన మంత్రివర్గ సహచరులు పెళ్ళకూరు శ్రీనివాసులురెడ్డిగారిని పరామర్శించి వచ్చారు.

శ్రీనివాసులురెడ్డిగారు త్వరలో ఆరోగ్యవంతులు కావాలని జిల్లా ప్రజలందరూ కోరుకుంటున్నారు.

### జనార్దనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెసునాయకుడు శ్రీ ఎన్. జనార్దనరెడ్డి 6 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఇందుకూరుపేట, కోటపల్లి గూడూరు మండల కాంగ్రెసు కార్యకర్తల సభల్లో పాల్గొంటారు. తిరిగి 11 తేది నాయుడుపేట, దొరవారిసత్రం మండల సమావేశాలకు హాజరౌతారు.

### బంద్‌లో ప్రమాదం

రిజర్వేషన్ల బంద్‌రోజు, శీలామహల్ దగ్గర జరిగిన ఒక లారీ ప్రమాదంలో రాధాకృష్ణయ్య (70) అనే వృద్ధుడు ప్రాణాలు కోల్పోయాడు. రాళ్ళ లారీ ఒకటి వస్తుండటం చూసి, విద్యార్థులు నిలిపివేశారట. ఆ హడావుడిలో లారీని వెనక్కుమళ్లిస్తూ డ్రైవరు తికమకపడి ఒక టీ బంకును గుద్దేశాడట; బంకు లోపల వుండిన రాధాకృష్ణయ్య హరీ అన్నాడు. అప్పుడే అక్కడకు వచ్చిన కలెక్టర్ శ్రీ ఇన్నత్ హుస్సేన్ అతని కుటుంబానికి ఐదువేలు నష్టపరిహారం ప్రకటించారు.

# బంద్ దిగ్విజయం- బస్సుకాల్చే యత్నం!

రిజర్వేషన్లకు వ్యతిరేకంగా జిల్లా నవసంఘర్షణ సమితివారు 4 తేది నెల్లూరులో సంపూర్ణ బంద్ నిర్వహించగలిగింది. సాయంత్రంవరకు ఒక్క వాహనాన్ని రోడ్లలో తిరగనివ్వలేదు; ఒక్క అంగడి తలుపు తెరవనివ్వలేదు. బ్యాంకులు పనిచేయలేదు; సినిమా హాళ్ళలో ప్రదర్శనలులేవు; పెక్కు ప్రభుత్వ కార్యాలయాలు మూతపడ్డాయి; ఆఖరకు పోస్టాఫీసుకూడా మూతపడింది. మధ్యాహ్నంవరకు టెలిగ్రాఫ్ సౌకర్యం లేదు.

గత బంద్ కంటే ఈసారి విద్యార్థుల సంఖ్య గణనీయంగా పెరిగింది. టౌన్‌లోని అన్ని కీలకకేంద్రాలలో గుంపులు గుంపులుగా కార్యకర్తలు నిలబడ్డారు. హరనాథపురంలో అయితే రోడ్డుకడ్డంగా పైపులుపెట్టి, సైకిళ్ళనుకూడా కదలనివ్వలేదు. నవాబుపేట, వి. ఆర్. కాలేజి, ఆత్మకూరు బస్టాండు తదితర ప్రాంతాలలో కూడా కార్యకర్తలు నిలబడ్డారు. పోలీసు బందోబస్తు కట్టుదిట్టంగా వుండింది కాని, వారెక్కడా జోక్యం కల్పించుకోలేదు.

బుజబుజనెల్లూరు దగ్గర ఒక ఆర్.టి.సి. బస్సును తగలబెట్టడానికి విద్యార్థులు ప్రయత్నించారు, కాని విఫలమైనారు. నెల్లూరుతోపాటు కోట, విద్యానగర్, కావలి, గూడూరుపట్టణాలలోకూడా సంపూర్ణ బంద్ జరిగింది. కోటలో 5 తేది ఉదయంకూడా విద్యార్థులు బస్సులనాపి, టైర్లకు గాలి తీసేశారు.

### కావలి లెక్చరర్‌కు డాక్టరేట్

కావలి జవహర్‌భారతి హిందీ లెక్చరర్ శ్రీమతి తుర్లపాటి కమలకుమారికి శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ డాక్టరేట్ ప్రసాదించింది. హిందీ సాహిత్యరంగంలో ఒక నవశకానికి కర్తగా కీర్తింపబడిన సూర్యకాంత త్రిపాఠి నిరాలా సాహిత్యంపై ఆమె సమర్పించిన పరిశోధనాపత్రంపై పిహెచ్‌డి ప్రదానం చేశారు. జవహర్‌భారతిలో డాక్టర్ పట్టా పొందిన తొలి మహిళ ఈమె.

### జపాన్ వెళ్ళిన నెల్లూరు ఇంజనీరు



తిరుపతి, ఇంజనీరింగ్ కాలేజిలో మెకానికల్ ఇంజనీరింగ్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న డాక్టర్ కె. వేణుగోపాలరెడ్డి 30 తేది జపాన్ వెళ్లారు. టోక్యోలో జరిగే "3వ ఆసియా కాంగ్రెస్ ఫ్లూయిడ్ మెకానిక్స్ కాన్ఫరెన్స్" లో ఆయన పాల్గొంటారు. తర్వాత టోక్యో, క్యోటో విశ్వవిద్యాలయాలలో వైజ్ఞానిక ప్రసంగాలు చేస్తారు.

వేణుగోపాలరెడ్డి, నెల్లూరు తాలూకా నారికేళ్ళపల్లి వాసి; శ్రీ కాటంరెడ్డి జయరామరెడ్డి సోదరుడు.

—తరువాయి 7వ పేజీలో

# పరభాషా నిర్మాతలు మన పరిశ్రమపై వాలుతున్నారు!

1987 లో తెలుగు చిత్రపరిశ్రమ గొప్ప పోటీని ఎదుర్కోనుంది. తెలుగు నిర్మాతలు ఎక్కువ చిత్రాలను ఒకవంక నిర్మిస్తోంటే, మరోవంక తమిళ, కన్నడ, మలయాళ చిత్రనిర్మాతలుకూడా తెలుగు చిత్రాలద్వారా తమ అదృష్టాన్ని పరీక్షించాలనుకుంటున్నారు. తప్పకుండా వాళ్ళచిత్రాలు హిట్ అవడానికి ఎన్నో అవకాశాలున్నాయి. వాళ్లు మన నిర్మాతల్లాగా నటీనటులను దృష్టిలోవుంచుకొని కథలను తయారుచేయరు. ఇతరభాషల్లో హిట్ అయినవాళ్ళ చిత్రాలనే తెలుగులో జాగ్రత్తగా హడావుడి పడకుండా చక్కగా రూపొందిస్తారు. ఒక క్రమపద్ధతిలో చిత్ర నిర్మాణం జరుగుతుంది. ఈ విషయం కొనుగోలుదారులకు బాగా తెలుసు. అందుకే ఎ. వి. ఎం. లాంటివంస్థ కొన్ని చిత్రాలను తెలుగులోనిర్మించబోతున్నట్టు ప్రకటించగానే కొనుగోలుదారులు వాళ్ళ స్టూడియోలముందు క్యూలో నిలుచున్నారు. మనవాళ్ళలాగా ఎక్కువ మొత్తానికి వాళ్ళు అమ్మడానికి ప్రయత్నించరు. కొద్దిపాటిలాభంవస్తేచాలు వాళ్ళకు. ఈ పరిస్థితిదృష్ట్యా వచ్చేఏడు తెలుగు చిత్రాల సంఖ్య మితిమీరిపోవచ్చు. ★

### వర్తకునిమీద తార కేసు

ఒక వర్తకునిమీద ఒక సినిమాతార పదిలక్షల రూపాయలకు పరువు నష్టం దావా వేసినవార్త ఇటీవల చిత్రపరిశ్రమలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఒకటిరెండు చిత్రాల్లోనటిస్తూ, తారావదానికి ఎక్కత్రాలనే తకనగల నటీమణులు చిరంకంపెనీలకు, సబ్బు కంపెనీలకు వస్త్రప్రకటనల్లో 'మోడల్స్'గాఫోజులిస్తుంటారు. అయితేచిత్రాలువచ్చి పెద్ద స్టార్ అయిపోయాక అలాంటి ప్రకటనల వల్ల ఇక తమకు ప్రయోజనం ఉండదని నిరాకరిస్తుంటారు.

నదియాఅనే అంటమైనయువతి ఎన్నో మలయాళ చిత్రాల్లో నికీతార. కోయంబత్తూరుదగ్గర బాలీపారై అనే ఊరువుంది.

> మా మద్రాసు సినీప్రతినిధి

అక్కడ ఒక జవుళివ్యాపారి తన కొట్టు ముందు బోర్డుమీద 'బ్రా' తొడుక్కున్న నదియాబొమ్మ వేయించాడు. ఏదో ఒక తమిళచిత్రం ఔట్ డోర్ షూటింగుకు ఆవూరుకువచ్చిన నదియా అకస్మాత్తుగా అబోర్డును చూసింది. జాకెట్ లేకుండా ఉత్త బ్రాతోవున్న తనబొమ్మను వ్యాపారంకోసం చిత్రించేహక్కులేదని ఆ కొట్టతనిమీద మండిపడి, వెంటనే ఆబోర్డులోని తనబొమ్మను తుడిచివేయమంది. "అది నీబొమ్మకాదుపో!" అన్నాడా కొట్టతను. ఇంతలో ఒక మళయాల సినిమాపత్రిక ఫోటోగ్రాఫర్ ఆ బోర్డును ఫోటోతీసి, పత్రికలో ప్రచురించాడు. దాంతో అగ్గిమయిపోయిన నదియా, పదిలక్షల పరువునష్టంకోరుతూ ఆషాపు యజమాని మీద కేసుపెట్టింది. తమాషా ఏమిటంటే నదియా ఎన్నో మళయాళం చిత్రాల్లో పైట చెంగు లేకుండా, కొన్నిట్లో అర్ధనగ్నంగా నటించిందికూడాను. అప్పుడది తప్పని పించలేదేమో! ఇప్పుడు పదిలక్షలకోసం తాపత్రయపడుతూంది.

### హీరో అభిమాని ఆత్మహత్య

మన యువతరం ఎటుపయనిస్తుందో అర్థంకావడంలేదు, నేటి చౌకబారు చలన చిత్రాలుచూసి, మనసు అదుపుతప్పి, కొందరు వ్యసనాలకు బానిసలవుతున్నారు; తమ భవిష్యత్తును నాశనం చేసుకుంటున్నారు. నంద్యాలలో ఒక మెడికల్‌షాపుతో పనిచేసే యువకుడు హీరో చిరంజీవి అభిమాని. రాష్ట్రంలో ప్రకృతి విలయతాండవానికి బలైవుండగా తాను ఆగస్టు 21న జన్మదినోత్సవం చేసుకోవడంలేదని చిరంజీవి కొన్ని దినపత్రికల్లో ప్రకటనలువేసినా— నంద్యాలలోని చిరంజీవి అభిమానసంఘాలవారు చందాలు వేసుకొని రెండుటూరిస్టుబస్సులలో ఆగస్టు 20 న మద్రాసుకు ప్రయాణమయ్యారు. మెడికల్‌షాపుతో పనిచేసే ఆ యువకుడు కూడా ఓ బస్సులో వెళ్ళాలనుకుంటే; ఇంట్లోనిపెద్దలు అభ్యంతరం చెప్పారు.

—కొరవ 11వ పేజీలో

# రమేష్ చిత్రానికి అక్కినేని స్విచ్ ఆన్- అప్పుడే అభిమానుల ఆర్భాటాలు!

ఇది సినిమానటుల కొడుకుల యుగం. మిగతా హీరోల కొడుకుల్లాగే కృష్ణ తన పుత్రుడు రమేష్‌బాబుతో "సామ్రాట్" చిత్రాన్ని, ఆగస్టు 29 న ఎ. వి. ఎం. స్టూడియోలో ప్రారంభించాడు. చలన చిత్ర పరిశ్రమకు చెందిన అతిరథ మహారథులందరూ విచ్చేసి శుభాకాంక్షలను అందజేశారు. ప్రత్యేకంగా పేర్కొనవలసిన విషయమేమిటంటే అక్కినేని నాగేశ్వరరావు చేతులమీదుగా "సామ్రాట్" చిత్రం ప్రారంభోత్సవం జరగడం. ఐతే, నందమూరిబాలకృష్ణతో చిత్రాలనిర్మించే నిర్మాతలు చాలా తక్కువసంఖ్యలో హాజరయ్యారు. వారిలో ఒక నిర్మాత "బాల కృష్ణకు పోటీగా హీరో రమేష్‌బాబు వస్తు

> తనకుమారుడ్ని తననుమించినవాడ్ని చేస్తాడా, కృష్ణ ?

న్నందుకు నాగేశ్వరరావుకి ఒకవంక పరమానందంగావున్నా- మరోవంక తనకొడుకు నాగార్జునకు ఈ రమేష్‌బాబు ఎక్కడ పోటీ అవుతాడో అన్న భయం లేకపోలేదు," అన్నాడు పక్కనున్న నిర్మాతతో.

ఇలా ఎవరికితోచిన కామెంట్స్ వారు చెప్పుకోవడం మామూలే.

ఐతే కృష్ణ చాలాతెలివైనపనిచేశాడు. రమేష్‌బాబుకి పంభాషణోచ్చారణలోనూ డాన్సులోనూ ఫైట్సులోనూ చక్కనితర్ఫీదును నిపుణులచేత ఇప్పించాడు. హిందీలో విజయవంతంగా ప్రదర్శింపబడిన "బేతాబ్" సబ్జెక్టును ఎన్నుకున్నాడు. పరుచూరి బ్రదర్స్ చేత స్క్రిప్టు రాయించాడు. బప్పీలహరి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణం ఏర్పాటుచేశాడు అంచేత, ఈ చిత్రం విజయవంతంగా మోగించడం తథ్యం.

ప్రారంభోత్సవం చాలాబాగాజరిగిందే కాని, అందరికీ హాస్యాస్పదంగా తోచిన విషయం ఒకటి వుంది. రమేష్‌బాబుకి అప్పుడే అభిమానసంఘాలు ఏర్పడటం. వాళ్లు ప్రారంభోత్సవానికివచ్చి "మాచర్ హీరో రమేష్‌బాబు జిందాబాద్" అని జయజయధ్వానాలు పలకడం, కొన్ని కరపత్రాలు అందరికీ పంచిపెట్టడం. రమేష్‌బాబు హీరోగా నటించిన మొదటి చిత్రం ప్రారంభోత్సవంనాడే ఏమిటీ హడావిడి అని కొందరు నవ్వుకున్నారు. తెల్పంటా సినిమాతారలను చూడాలనే మోజుతో

—కొరవ 11వ పేజీలో





'శ్రావణమేఘాలు'లో మురళీమోహన్, లక్ష్మి

పాతవేమన చరిత్రకు మహాకవి శ్రీశ్రీ సమీక్ష

# వేమన చిత్రం చూస్తే మూఢత్వం పెరుగుతుంది!

వాహినీవారి యోగివేమన ప్రివ్యూ చూచిన శ్రీశ్రీ "మాలి" పత్రికలో చిన్న సమీక్ష రాశాడు. ఇన్నేళ్ళతర్వాత మళ్ళీ తీసిన "శ్రీ వేమన చరిత్ర"కు కూడా శ్రీశ్రీ సమీక్ష అక్షరం అక్షరం వర్తిస్తుంది. చదవండి.

"....వేమన చిత్రాన్ని మెచ్చుకోలేని వాళ్ళలో నేనొకణ్ణిగా మిగిలిపోయాను.

ప్రారంభిస్తూనే తైరెక్టరు మరేమి జెతదలేకుండా వేమన్నని, సూర్యోదయాన్ని, పాటని ఒక్కసారే ప్రవేశ పెట్టాడు అది లగాయతు అఖరికి వేమన్న గృహప్రవేశంతాకా కథ సూటిగా,సాఫీగా గడచిపోతుంది. వాహినీవారి చిత్రాలలో కథ కనబడదనే విమర్శ సరైనదికాదు. ఆ-కథలోని క్రమవికాసం (జీవితదృష్టిలోగాని, అంతకన్నా తీక్షణమైన శిల్ప దృష్టిలోగాని) వుండదనడమే ఎక్కువ నిజం. మాటవరసకి, మోహనాంగిని వదలినతర్వాత వేమన్న యోగి అయితే, తేకున్న వదిలినతర్వాత మోహనాంగి

> సేకరణ :
> పురుషోత్తమ్

ఏమయినట్లు? జ్యోతి అనే కల్పితపాత్రకి Raison detre ఏమిటి? (జ్యోతిచని పోయిన్న ఘట్టంలో చాలామంది ప్రేక్షకులు కళ్ళనీళ్ళు పెట్టుకొన్నసంగతి నేను పసికట్టకపోలేదు. అయితే, ఈఅమ్మాయి

—కొరవ 11వ పేజీ

చాకలాయ వీధినాటకం

# చంటబ్బాయ్

ఓ నిర్దుష్టమైన గమ్యంతో, ఇతివృత్తం, కేవలం హాస్యం అందించాలని ఏర్పాటు చేసిన సన్నివేశాలు, మాటలు అంతటి, పాటలగారడీకి కట్టుబడి వర్ధించాలని ప్రయత్నం చేసిన చిన్న నాటకంలాంటి సాదా సినిమా 'చంటబ్బాయ్'. జంధ్యాల సంభాషణల రచయితగానే కాక, దర్శకుడిగా కూడా ప్రథమంగా విఫలమైతే, కథకుడిగా 'మల్లాది' సైతం, మల్లాదిగారి కథకు అన్యాయం చేస్తుంది. యాక్షన్ చిత్రాలతో విసుగుతెప్పిస్తున్న చిరంజీవి! ఇది కొత్త తరహా పాత్రేకాని, ఎందుకో జనం ఆయన్ను ఈ హాస్యనటనలో ఆదరించలేక పోతున్నారు. ఇది సినిమా సమగ్ర స్వరూపం.

రెండుభాగాలుగా సాగే కథావస్తువులో ప్రథమభాగం, పాండు అనబడే జేమ్స్ పాండ్, జ్వాల అనే అమ్మాయిపై మోపబడిన హత్యానేరాన్ని తప్పించి అసలైన

### చిత్రసమీక్ష

సి. నారాయణరావు

నేరస్థుణ్ణి చట్టానికి పట్టించడం. రెండో భాగంలో, ఓ కోటీశ్వరుడు కన్నకొడుకు 'చంటబ్బాయ్' ని వెతికి పట్టించడం ప్రధానమైంది. మేమే ఆ చంటబ్బాయ్‌మంటూ వచ్చిన ఇద్దరు యువకులు, ఆ ధనవంతుడి ఆస్తి కాజెయ్యాలని వేసిన పథకం వృథాకావడంతో పాటు, పాండుయే చంటబ్బాయిగా తెలిసిరావడంతో చిత్రం ముగుస్తుంది.

మూలకథలోనే పట్టు లేకపోవడంతో, సినిమా రూపంలో వెలితి పరాకాష్టకు చేరుకుంది. కథాపరంగా ప్రేక్షకుడ్ని లీనంచేసే అంశాలు, ఆవేశాలున్న సన్నివేశాలు చిత్రీకరణలో కరువయ్యాయి. అందుకే హాస్యప్రధానంగా జంధ్యాల మాటలు రాసినా, అవి పండలేక పోయాయి, ఒకటి రెండు సంభాషణల్లో తప్ప.

పాత్రచిత్రణకూడా చాలాతొందరగా కన్పిస్తుంది. జేమ్స్ 'పాండ్' చేసేవృత్తి, అది చిత్రించినవైనంలో ఎక్కడాహుందాతనం కన్పించదు. చంటబ్బాయ్ కోసం సాగే అన్వేషణలో క్రమబద్ధమైన ఆలోచనతో ప్రయత్నించినట్లు కనపడదు. పిచ్చిపిచ్చిగా వేసేతనలు, పున్నట్టుండి ఒకరిని చంటబ్బాయిగా గుర్తించడం మినహా! పోనీ హాస్యంకోసం ప్రయత్నిస్తున్నారా అంటే అదీ కన్పించదు. ఇలా సినిమాలోని ప్రధానపాత్ర నిర్వ్యాయోజనమై అపహాస్యం పాలైంది. జ్వాల భూమికకుగూడా పెద్ద ప్రాముఖ్యత కన్పించదు అలాగే వాక్లైన నిక్కల పాత్ర. ఇలా అన్నిపాత్రల అవసరం అంతంతమాత్రం వున్నట్టు తోచడంతోనే సినిమాలో 'సీరియస్‌నెస్' కరువై ప్రేక్షకుడికి అసంతృప్తి మిగిలిస్తుంది. అసహనం రగిలిస్తుంది.

'వందనప్పులిచ్చింతి చిరంజీవి నైపోతా' అనే పాండు మాటలు అక్కడక్కడా గుండెల్ని తాకగల్గాయి. కవయిత్రి, సంపాదకుడు కలసి సృష్టించిన హాస్యం హాయిగావుంది. ఆమె రాసిన అధునాతన కవిత్వానికి కొత్త పేరుగా, కవితలుగాదు 'తవిక'లు అనే పదం, ఈనాటి కలం వీ(బో)రులపై జంధ్యాల వేసిన చక్కని చురక. ఆమె పిండివంటల ప్రహసనం, అది తిని పత్రికా సంపాదకుడు 'ఏనుగును రిక్షాపై ఎక్కించుకురండి' లాంటి అపస్మారక అతితెలివి మాటలు మాట్లాడటం, ఆ సన్నివేశాలు సినిమాకు 'ఇంధనం'లా పనిచేశాయి. అక్కడ శ్రీలక్ష్మి, పొట్టిప్రసాద్‌ల నటన, చాలా తమాషాగా ఉంది. నవ్వుకోడానికి! సుహాసిని నటించాల్సినంత పాత్రకాదు, నటించలేదు, అగుపించింది. అరుణ తన పాత్ర పరిధిలో చక్కగా నటించింది. చార్లిన్ చాప్లిన్‌గా చిరంజీవి నటన ఎబ్బెట్టుగా ఉంది. ఆయన మిగతా వేషాలు కూడా అంతంతమాత్రమే!

స్వభావసిద్ధంగా తెలుగువారు హాస్యప్రియులు కాకపోవడం, వారు ఏడుపుల్ని, ఎడబాటుని ప్రేమించినంత 'నవ్వు'ను అభిమానించలేకపోవడంతో ఇలాంటి చిత్రాలు అపజయం పాలవుతున్నాయి. ఇలాంటి వాతావరణమున్న ఈ గడ్డపై ఇకపై జంధ్యాల, మల్లాదిలు మరొక ప్రయత్నం చేయకపోవడం ఎంతైనా ఉత్తమమనిపిస్తుంది. ★

### సినిమా

(9వ పేజీ తరువాయి)

దాంతో ఆయువకుడు విపరీతంగా నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసుకున్నారు. ఇంతటి దారుణం ఎక్కడైనా ఉందా? తమ అభిమాన హీరో పుట్టినరోజు పండుగను చూడకపోతే వచ్చే నష్టమేమిటి? దానికోసం తన నూరేళ్ళ జీవితాన్ని నాశనంచేసుకోవాలా? అభిమానం వెర్రితలలు వేయడంవల్ల వచ్చే ఇలాంటి అనర్థాలు ఎన్నోవున్నాయి.

### తారయింట్లో శిలావిగ్రహాలచోరీ

తల్లివేషాలువేసే పండరీబాయి పరమ భక్తురాలు. ఈమె ఇంటిముందు పండరీనాథుని గుడి కట్టించిందికూడాను. కోతంబాకంలోవున్న ఆకోవెలకు చాలామంది వెళ్ళి మొక్కుతుంటారు. ఆ గుడిలోని పాండురంగడు, రుక్మిణి పంచలోహ విగ్రహాలు ఆగస్టు 1న మాయమయ్యాయి. పండరీబాయి వెంటనే పోలీసులకు ఫిర్యాదుచేసింది. పోలీసులు దర్యాప్తు ప్రారంభించగా ఆ విగ్రహాలు అశోక్ నగరులోని అయూబ్‌ఖాన్ అనే ఒకవ్యక్తి ఇంట్లో దొరికాయి, అవేకాక కోడంబాకం ప్రాంతంలో కొన్నిగృహాలనుంచి దొంగిలించబడ్డ టేప్‌రికార్డర్లు, గడియారాలు, పట్టుచీరలు, స్టెయిన్‌లెస్‌స్టీల్ పాత్రలూ కనుగొనబడినాయి. "ఇదంతా పాండురంగనిమహిమే నా దేవుడ్ని మా గుడిలోంచి తస్కరించినవారు తగినశిక్ష పొందకతప్పదుకదా"? అంటుంది పండరీబాయి.

### వేమన

(9వ పేజీ తరువాయి)

అనవసరంగా కథలోకి ప్రవేశించిదికాబట్టి ఈమె నిష్క్రమణం విచారం కలిగించలేదు.)

వేమన్న మూఢవిశ్వాసాల కు విరోధికాని వేమన్న చిత్రాన్ని చూచినతర్వాత మన ప్రజలలో మూఢవిశ్వాసాలు మరింత పదిలమవుతాయి. వేమన జిజ్ఞాసి, సాధకుడు. మన అందరివంటి మానవుడు. అతనికి మానవాతీత శక్తులంటగట్టడం అనవసరం. గుడ్డి మనిషికి కళ్ళిచ్చాడని చూపించడంవల్ల వేమన్న ఆధిక్యం స్థాపించబడదు. "గంగిగోవుపాలు గరిటడైననుచాలు" అనేపద్యం చెప్పడంతో అతని అసలు స్వరూపం గోచరిస్తుంది. ఆ పద్యం చదివించడానికి గాను చక్కని సన్నివేశాలు సృష్టించడం నేనెంతైనా అభినందిస్తాను. అలాగే మరీ కొన్ని పద్యాలకుకూడా. అనుకూలమైన సంఘటనలు కల్పిస్తే. అది చరిత్రకి విరుద్ధమని గొణగను. ఎవరికీ తలవంచని వేమనచేత సాష్టాంగనమస్కారంచేయించడానికి జ్యోతివంటి Sentimental doll ను కల్పించాలా? నగుణబ్రహ్మోపాసనలోని సామంజస్యం వేమనకి తెలియక పోయిందా? అసలు హిందూమతానికి విగ్రహారాధన పునాది కానేకాదు. ఈనాడు Aldous Muxloy, W. H. Anden మొదలైన వారిని కలవరపరుస్తూన్న నిర్గుణ పరబ్రహ్మతత్వాన్ని ఏనాడో మన వాళ్ళు అందుకున్నారు. ఇవాళ మన సమస్య మతంకాదు. ప్రపంచపు మతసమస్యలన్నింటినీపరిష్కరించే సరంజామా మనకి సమృద్ధిగా వుంది. పాశ్చాత్యుల పారలౌకిక సమస్యల్ని మనం పరిష్కరించగలం. మన పాంచభౌతిక సమస్యల విషయంలో మాత్రం మరింత శ్రద్ధవహించడం మన తక్షణ కర్తవ్యం.

వాహినీవారు వేమన జీవితాన్ని కథావస్తువుగా తీసుకున్నారంటే నేను కొండంత ఆశపెట్టుకున్నాను. కాని తీరా చూస్తే చిత్రంలో వేమన్నా లేడు, జీవితమూ లేదు. ఒకరిద్దరి నటనానైపుణ్యం (మోహనాంగి తల్లి వేమనస్నేహితుడూ) ఒకటి రెండుచోట్ల డైరెక్టరు ప్రతిభ (వేమన సహ్యాద్రియాత్రలు, అభిరామయ్య కొలిమి సంఘటనలూ) ఒకే ఒక్క Montage sequence (కపాలంలో శైశవాది వివిధావస్థలు) మాత్రం ఆయా ఘట్టాల్లో అద్వితీయంగా వున్నాయి. ఇవి ఇండియాలో తీసిన ఏచిత్రానికి తీసిపోవు...."

మతం, నీతి, రాజకీయం ఇట్లా అన్ని విషయాలూ సినిమావాళ్ళకు కథావస్తువులే. ఆఖరుకు ఇవాళ 'విప్లవం' కూడా వాళ్ళకు కాసులు కురిపించేందుకు పనికి వస్తూంది. ఇంతకూ చెప్పవచ్చేదేమంటే విషయం ఏదైనా, దాన్ని వక్రీకరించి, జనాన్ని ఇంకా మూఢంగా, మూర్ఖంగా తయారుచేసేందుకేగానీ, సామాజిక వాస్తవాన్ని చిత్రీకరించి, చైతన్యవంతుల్ని చేసేందుకుకాదు. శ్రీ వేమన చరిత్రకూడా ఈ కోవకు చెందిన మామూలు చిత్రమే. ★

### అప్పుడే అభిమానులు

(9వ పేజీ తరువాయి)

ఈ నెతంతో వచ్చివుండాలని మరికొందరు భావించారు.

గుడివాడలోని సామ్రాట్ "రమేష్ కృష్ణ" ఫాన్స్‌వారు "తెలుగు చలనచిత్ర చరిత్రలో సంచలనం సృష్టించి, చలనచిత్ర రికార్డులను అధిగమించడానికి దూసుకువస్తూన్న ఘట్టమనేని యువకిశోరం" అంటూ ఒక దినపత్రికలో ప్రకటన చేయించారుకూడా.

హర్షణీయమైన విషయం ఏమంటే ఈ కొత్తహీరో తన మొదటి సంపాదన లక్షరూపాయలను వరదబాధితుల నిధి కోసం సమర్పించడం. ఈ విషయంలో కృష్ణకుతగ్గ తనయుడనిపించుకున్నాడు. హీరోగాకూడా అలాగే అనిపించుకుంటాడని ఆశిద్దాం.

కొత్తవెల్లువవస్తే పాతవెల్లువ కొట్టుకుపోవడం సహజం. అలాగే కొత్తహీరోల రాకతో కొందరు పాత హీరోలు మరుగున పడిపోవడంకూడా సహజమే.

### ఒంగోలు

(4 పేజీ తరువాయి)

తెలుసుకునేందుకై శ్రీ బాలయ్యనే నేరుగా ప్రశ్నిస్తే- దీనిపై ఆయన పెదవి విప్పడానికి నిరాకరించారు. ఇంకో ఆరుమాసాలపాటు తాను రాజకీయాల్లోకి తలదూర్చ దల్చుకోలేదని, ప్రస్తుతం కాంట్రాక్టు పనులలో ముమ్మరంగా వుంటున్నానని అన్నారు.

ఒంగోలు శాసనసభ్యుడు శ్రీ పాముగుపాటి కోటేశ్వరరావుతో యిటీవలకాలంలో శ్రీ బాలయ్యకు పెరిగిన వివాదాల కారణంగా బాలయ్య దేశం ప్రవేశానికి కోటేశ్వరరావు అడ్డుకొట్టగలడని అనుకుంటున్నారు. అయితే శ్రీ పాముగుపాటి ముఖ్యమంత్రి పెద్దల్లుడైన డాక్టర్ వెంకటేశ్వరరావు అనుచరుడు కావడంతో, శ్రీ బాలయ్య చిన్నల్లుడు చంద్రబాబు అండన చేరవచ్చని ఒకవర్గం ప్రచారం చేస్తోంది. ఏదేమైనా శ్రీ బాలయ్యగారన్నట్లు యిది జరిగితే గిరిగితే యింకెవ్వరో ఆర్నెల్ల తర్వాతగదా! అప్పటిదాకా అసలుసిసలు కాంగ్రెస్‌వాదైన శ్రీ బాలయ్యను కాంగ్రెస్ మనిషిగానే భావిద్దాం! ★

### జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | రు. 50-00 |
| ఆరు నెలలకు | 26-00 |

విడిప్రతి: ఒక రూపాయి

### ప్రకటన

పేనేటి మునుస్వామిశెట్టి చనిపోయినందున ఆయన వుహార్తులు అయిన పొజాల సుబ్బమ్మ జక్కల కోటమ్మలకు సంక్రమించినది. ఆస్తి కోవూరులోనుండు డోసెం. 8-4-40 రు గల యిల్లు ఖాళీ స్థలము. దీనిని సదరు జక్కల కోటమ్మ తన స్వంతమని అమ్మచూపుచున్నది. ఎవరుగాని సదరు ఆస్తిని కొనుగోలుచేసినను, తనఖావనుచేసికొన్నను చెల్లనేరవు. నన్ను సదరు వరాధీనములు జర్గించనేరవని ఇందుమూలముగాయావన్మందికి తెలియజేయడమైనది.

-పొజాల సుబ్బమ్మ.

వేల్లిపాలెం గ్రామపంచాయతి

### టెండర్ నోటీసు

నెల్లూరుజిల్లా చిల్లకూరు మండలము వేళ్ళపాలెంగ్రామ పంచాయతీగామ ఈ క్రింది తెలిపిన వీధిలైట్లు, కరంటు సామానులు సప్లయి చేయుటకు అధికారం పొందిన ఎలక్ట్రికల్ డీలర్లవద్దనుండిగాని, ఎలక్ట్రికలు సామానులు సప్లయిచేయు వారివద్దనుండిగాని సీలువేసిన టెండర్లు ఈ క్రింద సంతకంచేసినవారిచే 10-9-86 తేది మ 1 గం.లోగా స్వీకరించబడును. ఆ టెండర్లు ఆదేరోజు మ. 2 గంటలకు హాజరైన టెండరుదారుల సమక్షములో తెరువబడును ధరావత్తు మొత్తము రూ. 100/-లు చెల్లించి టెండరు కంటి పన్లకు లోబడి టెండర్లు దాఖలుచేసుకొనవలెను.

– కావలసిన సామానులు –

4' (40 వాట్సు) వీధి కరెంటు ట్యూబులైట్లు, ఫిక్చరుతోసహా కూడిన క్రాంప్టను కంపెనీవారి ట్యూబ్, కాపర్ చోక్ వగైరాలతో పూర్తి సెట్టింగు సామానులతో, కంపెనీవారు సప్లయి చేయు రేటు, విడి సామానుల రేట్లు ఈ కార్యాలయమునకు సరఫరా చేయుటకు ఒక సెట్టు రేటు తెలుపవలెను.

-పూడి సుబ్బయ్య
సర్పంచ్

నెల్లూరు ది. ము. కోర్టులో

O. S. 461/85

గాదిరాజు జానకమ్మ —వాది.
మొగెల అజీమ్‌బేగ్ —ప్రతివాది

మొగల్ అజీమ్‌బేగ్, కలాసిపాళెం, బెంగుళూరు-2, అనేవారికి;

పైదావా మీ నోటీస నిమిత్తం 18-9-86 తేది వాయిదా ఉన్నది. ఆ రోజు10-30 గం. మీరునేరుగాగాని, మీ వకీలుగాని కోర్టుకు హాజరై ఆక్షేపణలు వున్న తెలుపుకొనవలయును లేనియెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

—కె. వి రమణయ్య
అడ్వకేటు.

నెల్లూరు 4వ అ॥డి॥ము॥ కోర్టులో

O. S. No. 961/85

వెంకలూరు ఏసరామయ్య —వాది
పెమ్మారెడ్డి సుబ్బరామిరెడ్డి —ప్రతివాది

ఈ నంబరు వాది కోరూరు వారి ఆంధ్రిగ గ్రామస్థులు తరపున రిప్రజెంటివు కెపాసిటీతోటి దావా దాఖలు చేయబడి అందుమీద మీకు నోటీసు నిమిత్తం 19-9-86 తేదికి వాయిదా వేయబడియున్నది గనుక మీ ఆక్షేపణలు తెలుపుకొనవలెను.

-జె.ఎల్. నారాయణ, అడ్వొకేటు

# ప్రభుత్వంపట్ల ఉద్యోగుల విశ్వాసరాహిత్యాన్ని ప్రతిబింబించాయి సెక్రెటేరియట్ దుర్ఘటనలు!

సెక్రటేరియట్‌లో రెండురోజులపాటు జరిగిన బీభత్సకాండ, బహుశా ఏ రాష్ట్ర చరిత్రలో నూ జరిగివుండదేమో! ప్రభుత్వ ప్రతిష్ఠను, పటిష్ఠతను ఒక చిహ్నంగా భావించబడే సచివాలయంలో ప్రభుత్వాధినేతలకు పరాభవం ఎదురుకావడం అందరికీ విచారం కల్గిస్తూంది. ఎన్టీ రామారావుతో రాజకీయంగా విభేదించేవారు కూడా ఈ దురదృష్టకర పరిణామాలపట్ల ఆందోళన, ఎన్టీఆర్‌పై సానుభూతివ్యక్తం చేస్తున్నారు. తానుచేసే విధాన నిర్ణయాలను అమలుచేయవలసిన ఉద్యోగుల చేతనే ఇంతగా అవమానితుడైన రామారావునుచూసి అందరూ జాలిపడుతున్నారు. ఏ రాష్ట్ర ముఖ్యమంత్రికీ ఎదురుకాకూడని పరాభవం ఇది.

సెక్రటేరియట్ ఉద్యోగులు, ముఖ్యంగా మహిళా ఉద్యోగినులు ముఖ్యమంత్రిని ఒక జేబుదొంగకంటే హీనంగాచూశారు. వినడానికే రోతకలిగించే పదజాలంతో దూషించారు. ప్రభుత్వాధినేతకు అన్నగౌరవం ఇవ్వకపోత పోయారు. తోటిమనిషన్న విచక్షణకూడా లేకుండా ప్రవర్తించారు. నాదెండ్ల భాస్కరరావు హయాంలో గ్రంధి మాధవి వంటి ఎమ్మెల్యేలు తీసిన వెంటాపూర్వక ప్రసంగాలకంటే చౌకబారు మాటలతో ఆయన్ను చిత్రవధచేశారు.

నిజానికి సెక్రెటేరియట్ ఉద్యోగులు ఇంతగా రెచ్చిపోవడానికి, సభ్యతాహీనంగా వ్యవహరించడానికి సరైన కారణంకూడా కన్పించదు. విద్యార్థినుల పట్ల పోలీసులు అనర్థంగా, దౌర్జన్యంగా ప్రవర్తించడమే ఈదుర్ఘటనలకు ప్రేరణ అనుకుంటే, దానికి నిరసన చెప్పవలసిన మార్గం వేరు. ఎన్నో పర్యాయాలను, ప్రభుత్వ వ్యతిరేక ఆందోళనలను నిర్వహించిన సెక్రటేరియట్ నాయకులకు, ఈ చిన్న సంఘటనను ప్రతిఘటించే మార్గంతెలియక అయోమయంలో ఇతిగా వ్యవహరించారనుకోవడం పొరపాటు. ప్రభుత్వం పట్ల, ప్రభుత్వాధినేతలపట్ల ప్రభుత్వోద్యోగులలో క్రమ క్రమంగా క్షీణిస్తున్న విశ్వాసరాహిత్యానికి ఈదుర్ఘటనలు అద్దంపట్టాయని పరిశీలకులు భావిస్తున్నారు.

ఎన్. టి. రామారావు అధికారంలోకి వచ్చిన తర్వాత, ప్రభుత్వం తనకు శత్రువు అన్న ధోరణి ఉద్యోగులలో ప్రబలిపోయింది. తాము ప్రభుత్వంలో ఒకభాగం అన్న మానసిక అనుబంధం ఉద్యోగులలోనే కాక, ఉన్నతాధికారులలోకూడా లోపించింది. అందువల్లనే జరిగింది స్వల్ప సంఘటనే అయినా ఉద్యోగులు తిరుగుబాటు చేశారు. విచక్షణ కోల్పోయారు.

హోంశాఖ కార్యదర్శితో సహా, అందరు సీనియర్ ఐ ఏ ఎస్ అధికారులూ ముఖ్యమంత్రికి జరుగుతున్న పరాభవాన్ని మౌనసాక్షులవలెచూస్తూ, నిర్లిప్తంగా ఉండిపోవడం మరీ విస్మయం కల్గిస్తున్న విషయం. నిజానికి ఈ దుర్ఘటనలకు, పోలీసుల వైఫల్యానికి నైతిక బాధ్యత స్వీకరించవలసింది హోంశాఖ కార్యదర్శే! అయినా ఆయన కిమ్మన లేదంటే, అధికారులలో ఉద్యోగులలో ప్రభుత్వంపట్ల ఎంత భక్తి శ్రద్ధ ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు.

మా హైదరాబాదు విలేఖరి

మరొక కోణంనుంచి ఈ సంఘటన చూస్తే, సెక్రటేరియట్ ఘటనలు నివారించలేని వైఫల్యానికి ముఖ్యమంత్రి మాత్రమేగాక, మొత్తం పోలీసు శాఖే సిగ్గుతో తలవంచుకోవాలి. ఎంతోమంది ఉన్నతాధికారులు, పటాలాల పోలీసులు వున్న రాజధాని నగరంలో మూడు నాలుగు వందలమంది జనం దాడినుంచి ముఖ్యమంత్రిని కాపాడుకోలేక పోయారంటే-ఇక ఈ పోలీసులకు ఉద్యోగాలెందుకు? కోట్లు కోట్లు ఖర్చుపెట్టి జీతాలివ్వడమెందుకు? దాదాపు నాలుగైదు గంటలసేపు ముఖ్యమంత్రి తనగదిలో ఒంటరిగా, నిస్సహాయంగా బోనులో ఇరుక్కున్న పిల్లిలా, తోడేళ్ళమంద చుట్టుముట్టిన సాధుజంతువులా, కూర్చుండిపోవలసిరావడం ప్రభుత్వానికి పోలీసుశాఖకు ఎంతఅప్రతిష్ఠ?సిగ్గుచేటు?

* * *

ఇదిలావుంటే ఉద్యోగులనింతగా రెచ్చగొట్టి, ముఖ్యమంత్రిపైకి ఎగదోలిన సెక్రటేరియట్ ఉద్యోగుల నాయకుడు శ్రీ శంకరరావు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నాదెండ్ల భాస్కరరావుకు అనుచరుడని, అందువల్లే ఆయనింత బరితెగించాడని, ఒక కథనం. దానిలోని నిజానిజాలను ఇప్పుడు పరిశీలిస్తున్నారు.

ముఖ్యమంత్రి ఉద్యోగులను క్షమించి వదిలేస్తామని మొదట చెప్పినప్పటికీ మంత్రులందరి పట్టుదలతో వారిపై క్రమశిక్షణచర్య తీసుకోవడానికి నిర్ణయించారని తెలుస్తూంది ఇది ఉద్యోగులలో అరాచకాన్ని మరింత రాజేస్తుందని, పరిశీలకులు భయపడుతున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా ఉద్యోగుల సమ్మెను ప్రేరేపించినా ఆశ్చర్యంలేదనీ పరిభావన.

★

ప్రతి మాస్
లక్కీ డ్రా

సెప్టెంబర్ 5 తేది జరుగవలసిన డ్రాను అనివార్య కారణాలచే అక్టోబర్ 5 తేదీకి వాయిదా వేయడమైనది. గమనించ కోరుతున్నాను.

బి. వి. వర్మ



సంపాదకుడు [illegible] 17/170 [illegible] -524001